# యయాతి చ[illegible]ము

శ్రీ పొన్నికంటి తెలగనార్య ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

 [Price [illegible]

## ప[illegible]లు

| | | ప్రతి 1-కి రూ. | |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణ[illegible] | ... | 2 | |
| ఆంధ్రభారతము, పద్య[illegible]:— | | | |
| ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| శాంతిపర్వము | ... | 7 | 8 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 7 | 8 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3. సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనిపూర్ప | ... | 6 | 0 |
| కాశీఖండము, శ్రీనాథునిది | ... | 3 | 8 |
| కుమారసంభవము-నన్నెచోడ | ... | 5 | |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 0 | 1 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 1 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన | ... | 3 | |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్య ప్రణీతము | ... | 1 | |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | |
| అన్యాపదేశకోలాహలము, ద్విపద. | ... | [illegible] | |

T. Radha Krishna M...

శ్రీ ర స్తు

# య యా తి చ రి త్ర ము

పొన్నికంటి తెలగనార్యప్రణీతము





చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1956

# పీఠిక.

యయాతిచరిత్రము, అచ్చతెనుఁగుగ్రంథములలో మొద
టిది యని యిందలి

క. "మున్నెవ్వరు నొడువని యీ, తెన్నిడి కడుమీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నికమీఱఁగఁ జెప్పిన, నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పయినన్."

అను 1 ఆ. 11 పద్యము తెల్పుచున్నది. దీనిని రచించిన కవి పొన్నికంటి తెలగనార్యుఁడు, తండ్రిపేరు భావనామాత్యుఁడు, నని గ్రంథముగద్య చెప్పుచున్నది. కాని, సూత్రగోత్రములు చెప్పుట లేదు. నియోగిబ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు నని కం. వీరేశలింగముపంతులుగారు వ్రాయుటకాధారము కనఁబడదు. తాను తెలగనార్యుఁడు, తండ్రి భావనామాత్యుఁడునఁట. ఇట్లు పూర్వకవులలోఁ గొందఱు వ్రాసికొనియున్నారు. ఈకవి తనగ్రంథమును అమీర్‌ఖానుఁ డను మహమ్మదీయప్రభువున కంకితముచేసెను. ఈయమీర్‌ఖానునకుఁ బలిరైన మల్కిభరామునకు అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును గృతియిచ్చెను. మల్కిభరాము ప్రభుత్వములో నమీనుఖానువంశస్థులు మూఁడుతరముల నుండి యుద్యోగులుగానున్నారఁట. (చూ. 1 ఆ. 68 పద్యము) తెలగనార్యుఁడు యయాతిచరిత్రముకథ ప్రారంభించి యచ్చతెనుంగుగ వ్రాయుచుండ నదితెలిసికొని యమీనుఖాను మఱింగంటి యప్పనగారిం బంపి చెప్పించి తనకుఁ గృతియిచ్చునట్లు చేసికొనియె నని

మ. “తనకున్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱఁగాఁ జల్లుచూ
పున నెల్లప్పుడుఁ జూచి మన్నఁగల పెన్ప్రోడక్ మతింగంటి య
ప్పనగారిక్ మదిలోనిమాట దెలియం బాటించుచుం గాంచినక్
గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా నన్ను మన్నించుచున్.(1-9)

ఆ. పిలిచి పొన్నికంటి తెలగన్న నీచేయు, నచ్చ తెనుఁగుఁగబ్బ మన్నిరొడల
మించి వెలయఁగా నమీనుఖానునకిచ్చి, పుడమిలోనసిరులఁ బొగడుగనుము.
(1-10)

అనుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. తెలగన్నకుఁ బరిచయముగల యమీనుఖానునొద్ద యుద్యోగియగు అప్పన్న గారే యీకబ్బమును అమీనుఖానునకుఁ గృతియిప్పించి కవికి ధనాదిక మిప్పించియైననుండవచ్చును. సాధారణముగాఁ గావ్యములన్నియు నిట్లే యంకితమీయఁబడుచుండియుండును.

ఇక్కడి యచ్చతెనుఁగుకవిత్వము, “శ్రుతికటువుగాక మృదువుగాను బొందికగాను నున్నయది. ఇది యచ్చతెనుఁగు ప్రబంధములలో మేలైన దని తోఁచెడిని.” అని శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరములోఁ జెప్పియున్నారు. కం. వీరేశలింగంపంతులుగారు, “ఈకవికిఁ బూర్వమం దెవ్వరును శుద్ధాంధ్రభాషలో ప్రబంధముచేయుటకు ప్రయత్నించినవారైనను లేదు. ఇట్టిగ్రంథరచన కితఁడు మొట్టమొదటివాఁడే యైనను ఈకవి రచించినయయాతిచరిత్రము సర్వవిధముల చేతను కూచిమంచి తిమ్మకవి రచించిన యచ్చతెనుఁగుపుస్తకములకంటె శ్రేష్ఠతరముగా నున్నదని నాయభిప్రాయము” అని వ్రాసిరి. కూచిమంచి తిమ్మకవి యీ తెలగన్నగ్రంథమును జూచియే తనరామాయణము ప్రారంభించెను. చూడుఁడు.

క. “తెనుఁగునను మాఱుపెళ్లిడి, పెనచిన వినఁగూడ దనుచు బిరుదులఁ బెల్లుక్
మును పెల్పుబాస పెంబడి నునిచెదఁ గాదనకుడయ్య” (యయా. 1ఆ. 14ప.)

తే. "ఒనరఁ బేరులు బిరుదులుఁ దెనుఁగు సేయఁ
బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావునఁ గూరుపు మిదియు నట్లు." (అచ్చ తెనుఁగు రామాయణము.)

తెలగన్నను గాంచి రచియించినను దిమ్మకవికవిత్వము వీరేశలింగముపంతులుగారికి శ్రేష్ఠముగాఁ గనఁబడలేదు. కవి యొక్క వాగ్విలాసాతిశయమే ముఖ్యముగాని మొదటికవిత్వము చక్కఁగా నుండదు. తర్వాతికవిత్వము చక్కఁగానుండు ననుకొనుటలో సారములేదు. తెలగన్నయుఁ బూర్వకవులపద్యములు నూహలు వర్ణనములుం దీసికొని యనేకవిధముల నచ్చ తెనుఁగుచేసికొని తనగ్రంథములోఁ జేర్చుకొనియున్నాఁడు. పింగళిసూరనార్యుఁడు, "రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగాకుండుఁ" ఇత్యాదిగా ద్వ్యర్థికావ్యంబుం గూర్చి చెప్పియుండఁగాఁ దెలగన్న,

"అచ్చ తెనుంగుఁబద్య మొక టైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నందఁలచంద మెఱుంగువారు నిన్, మెచ్చరె"

అని చెప్పికొనినాఁడు. అనేకపద్యములు పాఠకులకుఁ జదువ నపుడు విదితమగు నని యిందు వేఱుగఁ జూపలేదు.

యయాతిచరిత్రమను పేరేగాని కథ యంతయు నిందు లేదు. యయాతివివాహము దేవయాని శర్మిష్ఠలయందు సంతానము గనుట ఇంతవఱకే గ్రంథము గలదు. యయాతికి శుక్ర శాపాదు లిందుఁ జెప్పలేదు. మిగిలియున్నకథయే యెక్కుడని తోఁచుచున్నది. వేటవర్ణనము మనుచరిత్రములోవలె విశేషముగాఁ జేయఁబడియెను. వేటలో నొక్క లేడిని దఱుముకొని

యయాతి యొంటిగ జాబాలియాశ్రమమున కేగును. ఆజాబాలి "నీవొక్క మృగమునకై యిట్టిమడవులకు రావచ్చునా? పూర్వము శ్రీరాముఁ డెంత మోసపోయినాఁడో యెఱుఁగవా" యని మందలించును.

"నావుడు నయ్యయాతి మదినాటినప్రేముడి ముజ్జగంబులం
బ్రోవఁగఁగావచీరమునఁ బొల్పగు రాముఁడు నట్టిబూమెచే
నేవగ మోసపోయె'' (2 ఆ. 58 ప.)

అని రామకథ కొంత తెలిసియుఁ గొంత తెలియనివానివలె నడుగును. ఇట్లే అనేకపర్యాయములు వేటలో వృషపర్వనిపట్టణసమీపమునకు వచ్చుచును, బ్రపంచజ్ఞానము లేనివానివలె "అతివ వృషపర్వుఁ డన నెవ్వఁ డతని యనుఁగుఁగూఁతుపేరేమి" యని (3 ఆ. 50 ప.) ఘూర్ణిక నడుగును. వృషపర్వుఁడును "కచుఁ డెవ్వఁ" డని (3 ఆ. 105 ప.) శుక్రు నడుగును. ఇవి యంత సరసముగాఁ గాన్పింపవు. ఏది యెట్లున్ననుఁ బ్రస్తుతము మనకు యయాతిచరిత్రమువంటికావ్యము లవసరమై యున్నవి.

ఆంధ్రభాషలో మన కిపుడు అచ్చతెనుఁగుఁగబ్బములు యయాతిచరిత్రముగాక కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము, నీలాసుందరీపరిణయమును, పాటిబండ పురుషోత్తమకవి కంసవిజయమును, అయ్యనకోట పార్థసారథిసెట్టిగారి సత్యవిజయము, రా. బ. కం. వీరేశలింగముపంతులుగారి శుద్ధాంధ్రభారతసంగ్రహమును, మచ్చ వెంకటకవి శుద్ధాంధ్రనిరోష్ఠనిర్వచనకుశచరిత్రము, కం. వీరేశలింగముపంతులుగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధమును, శ్రీదేవులపల్లి నరసింహ

శాస్త్రిగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనసారంగధరచరిత్రమును, దాసు శ్రీరాములుపంతులుగారి శుద్ధాంధ్రశాకుంతలనాటకమును గానఁబడుచున్నవి. పెక్కు లింకను సముద్రితములు గలవు గాని వాని నాదరించువారు తక్కువ.

ఈ తెలగకన్నకవిత్వము బహురసవంతమైనది. మనోహరమైనది. పద్యములు చాలవఱకుఁ జదువుచున్నపుడు సాధారణముగా నిది శుద్ధాంధ్రమనుమాట కెడములేకుండ ధారాళముగా నుండును. ఇందును సామెతలు జాతీయములును సందర్భానుసారముగ వాడియున్నాడు.

"ఏచి నని చి పూచి కాచి పండిన యమ్మి,న్పరము మేలితోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకునైనఁ, బండ్లుకచ్చు నలరుఁ బ్రాయ మొంది." 1-37

ఈరీతివి 1. 42, 43, 45; 2 ఆ. 75-94, తృతీ. 15-191 పంచ. 14 మొదలగునవి గలవు. కవి యాంధ్రమహాభారతములోని యయాతిచరిత్రమును జక్కఁగాఁ జదివియున్నాఁడనుటకు దృష్టాంతములు కలవు. "అనుఁగుఁజెలియఁబోలె నలరుఁదీవియ నూఁది నూతిలో వెడలిచి" మున్నగునవి చూడఁదగును. కొన్నికొన్ని విశేషములను పుటల యడుగుభాగమునఁ జూపియున్నాము.

ఔర యవ్వింటికి నబ్బులల్లిబలువింటికిఁ గీలది యేమి గలైనో (1 ఆ. 59.) ఇట్టి పద్యమును బాలకు లింకొక గ్రంథములోఁ జదివియున్నారు. తలంచినంతనే జ్ఞప్తికిరాఁగలదు.

తెలగన్నకవి అమీనుఖాను నొద్దివాఁడు. అమీనుఖాను మల్కిభరాము నొద్దియుద్యోగి. మల్కిభరాము గోలకొండ నవాబులలో మూఁడవవాఁడు. అతఁడు క్రీ. శ. 1550-1581 వఱకు రాజ్యముచేసెను. అమీనుఖానుకుమారుఁడు ఫాజిలషా సిరంగరాయలకడ కేఁగినట్లు గ్రంథములోఁ జెప్పఁబడియున్నది. తిరుమలదేవరాయల కుమారుఁడు శ్రీరంగరాయలు క్రీ. 1574-1585-వ సంవత్సరమువఱకు రాజ్యము చేసినాఁడు. కావున, యయాతిచరిత్రమును గవి యాకాలములో నెప్పుడో చేసియుండును. "శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చినతర్వాతను ఇబ్రహీంషా మరణము పొందకముందును (1574-1581 సం॥ మధ్యకాలమున) రచియింపఁబడినట్లు నిశ్చయముగాఁ దెలియవచ్చుచున్న"దని వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి.

స్థాలీపులాకన్యాయమున మే మీగ్రంథమునుగూర్చి ముచ్చటించినారము. విశేషములు వేత్తలు గ్రహింతు రని యింతతో విరమించుచున్నాము.

ఈగ్రంథమును ముద్రించుటకు మాకు గోదావరిజిల్లా పిఠాపురముడివిజను చెందు త్రిగ్రామములోని క్రొత్తపల్లి గంగయ్యగారు వ్రాసికొనిన తాళపత్రగ్రంథమును, ఆంధ్రసాహిత్యపరిషద్ద్వారమున వచ్చిన కాగితపుఁబ్రతియుఁ, బూర్వము రాజమహేంద్రవరములో ముద్రింపఁబడిన ప్రాఁతయచ్చుపుస్తకమును నాధారములయినవి.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు

# యయాతిచరిత్రము

## ప్రథమాశ్వాసము



చ. సిరులమెఱుంగుబోఁడి తన చెక్కులు సిబ్బెపుగబ్బిగుబ్బలున్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నల్వఁ దలంచి కేలుఁదా
మరఁ గుడికన్ను మూయుటకు మాటికి నవ్వెడువెన్నుఁ
డింపుతోఁ, దిరముగఁ బ్రోచుఁగావుత మదిం జెలరేఁగి
యమీనుఖానునిన్. 1

వ. అని యిచ్చం జెలంగు జేజేవోరం దలంచి యచ్చతెనుంగుఁ
గబ్బం బొక్కటి యొనరింపం దలంచి యున్నయెడ. 2

సీ. తెఱుగంటిదొగ ఱాలతెగలఁ దీటేసకోట
నిగనిగల్ నలుగడల్ నిండియుండఁ
దమ్ములవిందురాకొమ్మలదగదగల్
వేలుపుఁబ్రోలిర్ల విరియఁజేయఁ
గొత్తడంబుల కెంపుక్రొత్తడంబులరంగు
నింగికిఁ దోపు వన్నియలు నింపఁ
గడలి యూా నని చిల్వపడఁతిచా లగడిత
తెలిసీటి నేప్రొద్దుఁ గలసియుండ

తే. మిసిమిబంగారు మేడలమీఁదియెడల
నిడినముత్యాలుఁ జుక్కలుఁ దడఁబడంగఁ
దెలియ కెల్లరు వెఱఁగంద నలరు నెపుడు
మేలువజ్జీన్లగమికొండ గోలకొండ. 3

క. ఆవీ డేలుక సొబగుల
పూవిల్తుఁడు నిచ్చ చాగపుంబులి యనఁగా
దీవులకుఁ బాదుసాలకు
దేవర యిభరాముశాహు తే జడరంగన్. 4

చ. దురమున నోడిపోయి మఱి త్రోవలుగానక మార్తు రెంత
నేర్పరు లిభరాముశాహువు తిరం బగునండను జేరి
తొంటియు, చ్చెరువగుసొమ్ము రాకొమరుచేఁ గడు మ్రొ
క్కులఁ గాంతు రౌఁగదా, వెరవరు లైనవారలకు వింత
యె యాసిరు లెందు నుండినన్. 5

సీ. తెలివిసింగంపుగద్దియల రాతెలుగంటి
రాజ శోభించెను దొరలెల్ల మోడ్పుఁజేతులనె కొల్వఁ
బూని యేఁబదియాఱుమానిసి నెలవుల
పుడమితేం డ్లూడిగంబులకుఁ జొరఁగ
తీవి మున్నీటిలో దీవు లన్నియు నేలు
పాదపద్మములు మన్నీలు మెట్టుఁదామరల కెనఁగఁ
కల్పవృక్ష పర్ణములు దనతేజు సుడిగట్టువెనుకచీకటి నెల్ల
విరియించు తమ్ములవిందుగాఁగ

తే. వెలయు మలికిభరామునుఁ గొలిచి మనుచుఁ
గలనఁ దనచెయ్యి మీఁదుగాఁ గడిమి మెఱసి

'లోకాలోక[illegible]'
[illegible]

మేలు సిరులందునట్టి యమీనుఖాన
యొడయఁ డోకనాఁడు నిండుపేరోలగమున. 6

చ. పొలఁతుల్ చుట్టలు రాయబారులు దొరల్ ప్రోడల్ చె
లుల్ మన్నె వా, రలు మావఁతులు దీవులేలుబలియుల్
రౌతుల్ మొదల్గాఁదనుఁ, గొలువన్ సంతసమంది కబ్బములు
పేర్కొ వించుఁ బిల్పించి న, న్నలరంగాఁ దనదండ నుంచు
కొని నెయ్యంబొప్ప మన్నించుచున్. 7

క. కలపము చేసిన గందం
బలఁదించిన వెనుక వన్నియలపచ్చడముల్
పలుమానికములసొమ్ములు
బలుతేజీ లిచ్చి కూర్మిపై పైఁ బర్వన్. 8

మ. తనకు న్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱఁగాఁ జల్ల
చూ, పున నెల్లప్పుడుఁ జూచి మన్నఁగల పెన్పొందన్ మరిం
గంటియు, న్పనగారిన్ మదిలోనిమాట దెలియంబాటించుచుం
గాంచినన్, గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా
నన్ను మన్నించుచున్. 9

ఆ. పిలిచి పొన్నికంటి తెలగన్న! నీచేయు
నచ్చతెనుఁగుఁగబ్బ మన్ని యెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడు గనుము. 10

క. మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిడి కడుమీఱి యచ్చ తెనుఁగుంగబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పయినన్. 11

ఉ. అచ్చ తెనుంగుఁబద్దె మొకఁడైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తె
మెల్ల ని, ట్లచ్చతెనుంగున న్నొడువ నందుల చంద
మెఱుంగువారు నిన్, మెచ్చరొ యబ్బురం బనరొ మే
లనరో కొనియాడరో నినున్. 12

క. అనవుడు బళి నాకబ్బం
బునకుఁ దేఁ డబ్బెఁ దావి పుత్తడికింగ
ల్గినటేవి ననుచు మదిలో
నను సంతసమంది కూర్మి నన లెత్తంగన్. 13

క. తెనుఁగునకు మాఱుపేళ్ళిడి
పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులుఁ బేళ్ళన్
మును వేల్పుబాస వెంబడి
నునిచెదఁ గా దనకుఁ డయ్య యుల్లములందున్. 14

వ. అని పలికి లాలసరిగజాంకుశుండును రాయపక్షిసాళ్వాండును సతకాసింహాసనాధీశ్వరుండును సింగిణీసురత్రాణుండును దురగారోహణరేవంతుండును సింహతలాటరాయండును నగు మలికిభరాముపాదుశాహునకు నితవరియై చదువులకుం గుదురై మన్ననల కెన్నికయై చెన్నొందు నమీనుఖానసింగంబు వంగడంబు నేర్పరించెద నది యె ట్లనిన. 15

సీ. మున్నీటిరాణి యా విన్నేటి యేవేల్పు
నడుగుఁగెందామర నలరు తేనె
బాసవాల్గము లెన్ను ప్రామిన్కు- లేవేల్పు
చెలువంపుఁబొవాలగిలుకురవలు
పాదరక్షలు

కడిఁదిరక్కసిమూఁక మెడచాల్పు లేవేల్పు
చేనున్న సుడివాలుచికిలికళుకుఁ
గమ్మఁదెమ్మెరపూఁపదిమ్ము దా నేవేల్పు
మంచుమించుల పాను పంచదూది

తే. యతఁడు దానైన కర్తారుఁ డలమి కూర్మిఁ
బ్రోవ సత్యచింతామణి పొట్ల చెలువు
నందుఁ డెందేపలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ
బుడమి వెలసె హుమాయూపుడమిఱేఁడు. 16

క. కలిమిని బలిమిని బిడిముడిఁ
బలుకులపస నీవిరివి బంటుఁదనమునన్
వెలయు హుమాయ్యూ అం
పిలు సొంపుల జాదుబీబిఁ బెండిలి యయ్యెన్. 17

క. ఆమగువయందు నతఁడు బ
డేమియ్యాఁ గనియె సందడించుచు సిరు లెం
తో మెఱయఁగ వెన్నుఁడు సిరి
చామవలన మరునిఁ గన్నచందము మీఱన్. 18

సీ. పూవింటివాఁడు నేర్పున సోయగంబున
వినువాఁకబిడ్డండు వింటికడిమిఁ
దామరచెలిచూలి తగునీగి నానచే
రాముండు ప్రతినబీరంబునందుఁ
బుడమితాల్పరియె నిల్కడఁ బల్కునేర్పున
చ[illegible] రాజు సొంపున నిబ్బరంపుఁదెలివి
నేనుమోముల మేటి హెచ్చుగుబలిమిచే
రారాజు సొమ్ములరవణమునను

తే. నెట్టివజ్జీర్లు నెన్నంగ నీడుగారు
కొమరుమీఱు హుమాయియాకొమరుఁ డగుచుఁ
బొలుపుఁ గనిన బడేమియాపుడమి తేని
కహహా! ముజ్జగములయందు నరసిచూడ. 19

తరల. పలుకులేజవరాలి వేసలిఁ బాలసంద్రములోని యా
కలిమితొయ్యలిగేస్తు నెమ్మెయి గాలి మేపరితేని చూ
పులబెడంగును బాసవాల్కనుపూపకందు నదల్చు బా
గులయసంబు బడేమియా తనకుఁ సతంబుగఁ దాలిచెన్. 20

వ. అతండు. 21

క. కలిమిచెలి వెన్నుఁడుం బలు
కులలేజవరాలు నాలుగు మొగములతఁడుః
బలెఁ దగు సిలారుబీబిం
గొల మలరఁగఁ బెండ్లియయ్యెఁ గూరిమిమీఱన్. 22

ఉ. చుట్టపువారి రాసిరులచూపులకోపులకైపులాని చే
పట్టి యనుంగుగా నపుడు ప్రాపగుకూరిమి నాబడేమియా
పట్టపురాణి యై కలిమిఁ బొటిలుచుండు సిలారుబీబి యె
ప్పట్టున నానెలంతకును బొటియెయెన్నఁగ గట్టుచూలియున్.

ఆ. ఆసిలారుబీబియందు బడేమియా
పుడమితేఁడు సిరులఁ బొందునట్టి
కడఁకతో నమీనుఖాను వేల్పులతేనిఁ
గనియె మదిని గూర్మి గడలుకొనఁగ. 24

క. అనువుగ మఱియు నతఁడు సర
బనబీబిం బెండ్లియాడె బలు వేడుకతోఁ

గనియెం దగ నాయమయం
దును బాబనుమియ్య నీవితోవచెలికానిన్.

మ. కలనం బాబనుమియ్యసింగము కడంకన్ మార్తురేనుంగు జం
గిలిఁ జేకైదువ నొంచి వానితలలం గీల్కొన్న మొత్తెంబు లే
తలఁబాలా ననినేల పెండరఁగుగా దా సొంపుతో మీఁబుచున్
గెలుపుంబైఁడి నెలంతఁ గైకొనియె నగ్గింపన్ జగం బంతయున్.

సీ. పట్టంగనీఁడు సంబళికలు కలనిలోఁ
జేరవచ్చినమార్తుచేతఁ గాని
పూననీఁ డడపంబు పొగరుతో బవరంబు
సేయవచ్చినవానిచేతఁ గాని
తేనీఁడు గొడుగు మత్తిల్లి యాలంబులోఁ
జేపడ్డమన్నీనిచేతఁ గాని
తాల్పఁగనీఁడు కుందనపుఝారీ చివ్వఁ
జెనకవచ్చినతేనిచేతఁ గాని

తే. యతనిఁ గొనియాడ నలవియే యైదుతలల
వేల్పురాయనికైనను వేయితలల
ప్రోడ కేనియు నని చాలఁ బొగడ నెగడె
నిండువేడ్క నమీనుఖానుండు పుడమి. 27

ఉ. మించి యమీనుఖానుఁ డెలమిం గలబట్టకు నెల్ల నిచ్చెఁ బ
ట్టంచులపచ్చడాలు వరహాలు సరాలు గుఱాలు పల్లకీల్
కుంచెలయందలాలు గొడుగుల్ పడగల్ కడు దొరహత్తుగా
నెంచఁగ నెవ్వరీ డతని కీగిపసం బరికించి చూచినన్. 28

సీ. పలపలనై మ్రానుపడి పండ్లుచూపెడు
పుశుకుఁజెట్లను వేఁడఁబోవ నేల
మించుచూపుచునె నమ్మించి నిల్కడయేది
విస మొసంగెడుమబ్బుఁ గోసర నేల
యొలివోయి యీలేక యొకపూఁటవెట్టెడు
తామరచెలిపట్టిఁ దడవ నేల
పొరలంగఁబడుచుఁ దాఁ దెరమలుంగున నుండి
కసరెడుమున్నీటిఁబొసఁగ నేల
తే. తెలివి గురిగొల్పి నిచ్చలుపలుకుఁ దియ్యఁ
దనము గాన్పింప నొసఁగెడు దారిచేత
మిగులఁ బొలుపొందునట్టి యమీనుఖాన
యొడయఁ డొప్పులకుప్పయై యొనరుచుండ. 29

సీ. దురములో ప్రేఁటాయితునుకలుగా ప్రేయు
నట్టి రౌతులకెల్ల నాటపట్టు
తొడరి బెబ్బులినైనఁ బెడకేలఁ బడఁద్రోయు
పూపు గల్గినబంట్ల పుట్టినిల్లు
పట్టిమ్రాఁకుల నిగు ర్వెట్టెడు పాటలఁ
బాటిల్లు గాణల పట్టుఁగొమ్మ
పుట్టఁబుట్టినప్రోడ పొల్పునఁ జెప్పఁగాఁ
గలుగుజాణాలమొత్తములకు నెలవు
తే. నైన తనపేరఁ గల్గు నమీనుపురము
నందు మున్నీటిఁజోక చేయంగఁ జాలు
చెఱువు త్రవ్వించె మిగుల నచ్చెరువుగాఁగ
నిండువేడ్క నమీనుఖానుండు మెఱసి. 30

ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కోసలనాఁట సత్యచిం
తామణి పొట్లచెర్లను సతంబగుచుండ నమీనుఖానుఁ డిం
పామతిలంగ నిల్పెఁ బొడవై బెడఁగైన మసీదుఁ గాంచి
యం,దే మను వెండికొండపయి కేఁగఁదలంపక జేసికంటి
యున్. 31

చ. పొడవుల కెల్లనుం బొడవు ప్రోడలు నెమ్మదిలోనఁ గాంచు ని
ల్కడ కడలేని తేజున జగంబున కవ్వలదైన వెల్లు నె
య్యెడలను బొందు వారలకు నెక్కఁగ నిచ్చెన యామసీదు
నిం, పడర నమీనుఖానయొడయండు తిరంబుగ నిల్పెఁ
బొల్పుగన్. 32

చ. కడక నమీనుఖానుఁడు జగంబు తనుం బొగడంగ వేడ్క
తో, విడువక యెప్పుడుం బుడమి వేల్పులబిడ్డల పెండ్లి చేయఁ
గా, నడరెడుబీతు లోఁబొడను నందుకతంబునఁ గాదె
దూఱుఁ బే,రడవులలోపల న్దబిసినై కనుపట్టెడు గాలి
చూలియున్. 33

ఉ. దొమ్మి నమీనుఖానుఁ డని దూకొని గెల్వులఁగొన్న
సొమ్ముఁ దా,నిమ్ముల లిబ్బులున్న నవి యేర్పడఁ జక్కులతేఁడు
గాంచి నా, తొమ్మిదిలిబ్బులున్ బలిమితోఁ గనునో యను
చుం దలంపులో, నమ్మక కావియుండు జతనంబున రేలుఁ
బగళ్లు నెంతయున్. 34

క. అబ్బురమై పొలుపొందెడు
కబ్బంబులు చాల నంది కనియె నసంబుల్
నిబ్బరముగఁ బొడమెడు పే
రుబ్బున నల్లడల జాణలో హో యనఁగన్. 35

సీ. మారేళ్లు నేరేళ్లు మామిళ్లు జిన్నులు
మాదీఫలంబులు దూదినిమ్మ
లీఁడెలు మేడులు జీడులు దాడింబ
లనఁటులు పనసలు చనుపకములు
పొగడలు పొన్నలు పోఁకమ్రాఁకులు కమ్మ
రేనులు నిమ్మలు రేగు లిప్ప
లంబాళములు కజ్జురంబు లనాసలు
నారికడంబులు నారదబ్బ
తే. లగరు లేలకి విరవాది యాకుఁదీఁగె
మల్లియలు గొజ్జఁగులు దాక మొల్ల మొగిలి
మొదలుగా నివి యెప్పుడుఁ బూచి కాచి
యుండుతోఁట లమీనుఖానుండు నిలిపె. 36
ఆ. ఏచి ననిచి పూచి కాచి పండిన యమీ
న్పురము మేలితోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకు నైనఁ
బండ్లువచ్చు నలరుఁ బ్రాయ మొదవి. 37
క. చలిపందిరులును సత్తరు
వులు మాతులు బావులుం బువుందోఁటలుఁ జె
ర్వులు నల్లిండ్లును మొదలుగ
నిలిపి యమీనాఖానుఁ డసము నించెం బుడమిన్. 38
క. ఇట్టి గొనంబులచే నె
ప్పట్టున నెన్నంగఁదగిన బలియుఁడు సొంపుల్
నెట్టుకొనఁ దనకుఁ దగియెడు
పట్టపురాణులను గూర్మి పైపైఁ బర్వన్. 39

క. గరిత బడే బీబీ సె
క్కరబీబీ సెమ్మబీబిఁ గనుపట్టెడు రా
మరుఁ డగునమీనుఖానుఁడు
సిరు లొదవఁగఁ బెండ్లియాడెఁ జెలు వలరంగన్. 40

వ. వారియందు. 41

చ. కొడుకులకోట పొల్కడలికూఁతురితో నెనవచ్చులేమ
యెప్పుడుఁ గడుఁబేదలాదరువు ప్రోచును జుట్టలఁ గన్న
తల్లి యై, యడుగిడ దావలం బెనిమిటాడినమాటకు మాట
వాసి జెం, దెడు బడెబీబి సాటి గలదే మఱియొక్క పొలంతి
యయ్యెడన్. 42

సీ. అత్తవారిండ్లకు నరుగుకన్నియలకుఁ బెన్న
గట్నంబు లిచ్చుచు గారవించుఁ
బ్రొద్దు ప్రొద్దుననె యెప్పుడు లేచి వాడల
పసిబిడ్డలకు నెల్లఁ బాలుపోయు
నాఁకొన్న వారల కద్దమ రేయైన
నారగించఁగఁ బెట్టు నరసి యరసి
పాలునీ రెనసిన బాగునఁ బెనిమిటి
తలఁపులో మెలఁకువ మెలఁగ నేర్చు

తే. నౌర తనపుట్టినింటికి నత్తవారి
యింటికిని వన్నెఁ దెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడేబీబిఁ దరమె పొగడఁ
దమ్మిపూవింట నెలకొన్న దంటకైన. 43

క. కలిమిపొలఁతిఁ బోలిన యా
చెలువకును నమీనుఖానుసింగంబునకుం

గలిగిరి గతాతఖానుఁడు
బలియుఁడు ఫాజీలఖాను పట్టపుదొరయున్. 44

క. అనిలో గతాతఖానుఁడు
తనతేజీ నెక్కినట్టితఱి నదరుం గ్ర
క్కున నెడమకన్ను సెకవెల్లుఁ
గునకుం దెఱగంటిదంటకొమ్మలగమికిన్. 45

సీ. నెఱపల్కు నెఱపులనే చాల మెప్పించి
యక్బరుచే మెప్పు లందుకొనియెఁ
జని విశ్వనాథదేవునిచేత మస్తున
వెలయు నేస్తులఁ దెచ్చె వేనవేలు
పూనికి నేదులాఖానువీటికి నేగి
పలుమఱు మించుకప్పములు గొనియె
మాదనమల్కి బరీదు నిజాంశాహు
దనయేలికకుఁ బన్నుఁ బనుప నడఁచె

తే. మఱియుఁ గన్నడరాజులు మెఱసి పొగడి
నెనరు దళుకొత్తఁ గ్రొత్తకాశికలు వనుప,
మనియె మల్కిభరాముమన్నన గతాత
ఖానరాయఁడు రెండవ కలువతేఁడు. 46

సీ. తలిదండ్రులేమాట తన కానతిచ్చినఁ
దలమోచి నడుచు గతాతఖానుఁ
డిభరాముపాదుసా యేలెడుపుడమిలోఁ
దగవులరాజు గతాతఖానుఁ
డల్ల చిన్నప్రాయంబునందు రాజులచేతఁ
దగునిమ్మపండు గతాతఖానుఁ

డేప్రొద్దుఁ గూరిమి హెచ్చఁ గర్తారునిఁ
దలఁపులో నిలుపు గతాతఖానుఁ

తే. డరబి పారసి గుజరాతి యార్రె వచ్చు
తెనుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ
దారి గన్నట్టివాఁడు గతాతఖానుఁ
డహహ యతనికి నెవ్వరీ డరసి చూడ. 47

ఉ. లాలసరీగజాంకశుఁడు లావున నాఁగటిజోదునైనఁ గెం
గేలనె గీ టడంచి బలుగెల్పుఁ బయిండినెలంత నేలుకోఁ
జాలినవాఁడు సొంపులను జందురుఁ డెంచ గతాతఖానునిం
బోలినవారు గల్గుదురె పుట్టినవారలఁ బుట్టువారలన్. 48

వ. అతని తమ్ముఁడు. 49

మ. అనిలో మార్కొను మార్తతేండ్లఁగడు నెయ్యంబొప్పఁగా
వేల్పుక్రొన్ననబోండ్లం గలయంగఁజేసి మరి కాసల్ గట్టు
లు వాఁకలే, యునుకుల్ గా నొనరించెఁ గొందఱికి నోహో
మేలు ఫాజీలుఖానుసర్కు సాటి దలంప నెవ్వ రిఁక
నెందు గ్రందుగా నెన్నినన్. 50

చ. కని తనరాజు లెన్నుకొనఁగాఁ బెనుపౌఁజులతో సిరంగరా
యని కడకేఁగిమాటలనె యాయనఁ దేఱిచితెచ్చిమల్కసర్కు
మనుకువసంటుచేసి యొరిమం గడుమెచ్చులు గొన్న మేటి నే
మని పొగడంగవచ్చు నవు నౌ నిఁక ఫాజిలుఖానరాయనిన్.

సీ. తగువేల్పు దొరరాణి మగమానికపుసొమ్ము
సెగతేనిఛాన గొజ్జఁగులబంతి
జముగేస్తు రాలిమై నమరుకప్రపుఁబూఁత
పొలదిండిరాతేని నెలఁతనగవు

పొలసు + తిండి - పొలదిండి

నీటిరాయనికల్కి నిద్దంపుఁబువ్వాల్వ
తెమ్మెరకొమ్మచే తెల్లదమ్మి
ముక్కంటిచెలి లేమ ముత్తెంపుఁజేర్చుక్క
నెలత్రాల్పు ష్టడక్కతి పన్నీటిజలక
తే. మగుచుఁ జిలువలగమి కానిఁ దొగలతేనిఁ
గ్రిందుమీఁద నడంచి యేకందు లేక
యలమి ఫాజీలుఖానునియసము లెపుడు
నెలమి జగములఁ బండువెన్నెలలు గాయు. 52

సీ. మదిలోఁగి యలనిజామనమల్క పెట్టిన
పల్లకీ లొకవంక బాగుమీఱ
నుదిరి యేదులఖానుఁ డొసంగిన పైగోవ
గుఱ్ఱముల్ బడివాఁగె గొల్చి రాఁగ
వేడుకతో నేడుమాడెలదొరలు కా
నుక లంపినట్టి యేనుఁగులు బెరయ
కన్నడరాయఁడు మన్నించి యంపిన
ముత్తేలపెట్టెలు హత్తి మెఱయ
తే. నచ్చి తెచ్చిన సొమ్ములు మచ్చి కలర
నిచ్చి యిభరాముశాహుచే మెచ్చు గనియె
నట్టిఫాజీలుఖానరాయనికి సాటి
గలరె నేర్పరు లెల్లజగంబులందు. 53

వ. మఱియు నమీనుఖానుని రెండవదేవేరి యెట్టి దనిన. 54
తే. కలికి నిజమరి జాణ బంగారుకుండ
వన్నెవాసిగ మెలఁగెడిపిన్నపెద్ద

చుట్టములపాలితంగెటిజున్ననంగఁ
బేర్మిఁ జెలువొందు సెక్కరబీబి యెపుడు. 55

క. ఒఱపరి సెక్కరబీబీ
తెఱవందు నమీనుఖాను దేవర గనియెన్
నెఱజాణ యబ్దులల్లిని
మఱియును షేకీభ రామమరునిం బెరిమన్. 56

సీ. తనరూపువలయందుఁ దలిరాకుబోఁడుల
కనుఁదళ్కు బేడిసగములు దగులఁ
దనచాగ మనుమబ్బు మొన వేఁడువా రను
చినుకు మేపుడుపుల్గు లెనసిపొదలఁ
దనయడుగుండ్లములను రాచనెట్టెంపుఁ
జిలుదిండె రాతుమ్మెదలు మెలంగ
దనపరంజీచిల్వకును మార్తురా జేండ్ల
యుసుఱుగాడుపు లింపు లొసఁగుచుండ
తే. నొనరునిభ రాముపాదుశాహుజురునందు
బొందుగా వ్రాయనేర్చిన ప్రోడ యైన
యబ్దులల్లీకి నీడెవ్వ రరసిచూడ
నహహ గొనముల నతనికి నతఁడె తగును. 57

క. అరబీ పారసి కన్నడ
ము రుమీ కన్నోజి తెనుఁగు మొదలగు బాసల్
పరికించి కుతుబుశాతలఁ
బరయుచుఁ బొలుపొందు నబ్దులల్లీ పుడమిన్. 58

ఉ. కంటెని వింటినేర్పునను గావక కయ్యమునందు నొంచినన్
వింటికి నేఁగి వేలుపులవీటను జూపుకటారికత్తెలా

దంటలగుబ్బచన్నులతుద న్నెలకొందురు మార్తు రౌర య
వ్వింటికి నబ్దులల్లి బలువింటికిఁ గీలది యేమి గల్గెనో. 59

క. అతనికిఁ గూరిమితమ్ముఁడు
సతముగ షేకీభ రాముచదురుఁడు పగరం
దతిఁ గూఁడుకోక లరయని
ప్రతినలు వట్టించి మలలపజ్జల కనిచెన్. 60

మ. అరయన్ షేకిభ గాము రా నెలకుఁ బ్రాపైనట్టి లోఁగూర్మిచే
సిరియుం బల్కుల తమ్మికంటియుఁ గడుం జేదోడు వాదో
డునై, వరుసన్ ద్రిమ్మరుచుండు రన్న మఱికైవారంబుఁ
గావింపఁగాఁ, దర మే యాయనచాగముం జదువులుం దా
నొక్కముక్కంటికిన్. 61

వ. ఇంక నమీానుఖానుమూఁడవ దేవేరి యెట్టి దనిన. 62

క. వీడదు తనచుట్టంబులఁ
జూడదు పెఱవారి మగనిచొప్పరయక మా
టాడదు పలువేల్పులఁగొని
యాడ దహహా సెమ్మెబీబి నలవియె పొగడన్. 63

క. తగునట్టిసెమ్మెబీబీ
మగువయును నమీానుఖానమగసింగము సొం
పుగఁ గాంచి రబ్దులకరీ
ము గొనంబుల ప్రోకఁ జాగములతోఁ గతేనిన్. 64

సీ. మాటనేర్పున రాజు మదిఁ గూర్మి నిండఁగా
నలరించు నెప్డు డబ్దులకరీము
వలతేనికైవడిఁ దలిరాకుఁబోఁడుల
పలపించుజాణఁ డబ్దులకరీము

పారసి యక్షరంబు లేర్పడ వ్రాయఁ జదువంగ
నలువ తలంప నబ్దులకరీము
అడుగువారలకు లే దనుమాట తనమదిఁ
దలఁపఁ డెన్నఁడును నబ్దులకరీము
తే. మించి యిభరాముశాహు మెప్పించి మేలు
తగటుదట్టీ లుక్కళాయీలు పొగరుమిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుఁ గాంచి
కలిమి పొగడొందెఁ బుడమి నబ్దులకరీము. 65

చ. చదువుల ప్రోఢ నేరుపరి జాణలు మెచ్చఁ గడంగి దాయలన్
గదిమి యడంచి గెల్పుసిరిఁ గైకొని మించినమేటి యెప్వు
డున్, మదిఁ దనవేలుపు న్నిలిపి మల్కిభరాముశహాను
గొల్చుఁ గూర్మి దయిలువాఱ నబ్దులకరీమునకున్ సరి
యెవ్వ రిచ్చటన్. 66

వ. మఱియు మెఱయుసిరులకు నెలవై తమపేరుండైన హాజ
రతిమోఖ దుంజిఖాదిరి యడుగుందమ్ములు తలంపులో నెల
కొల్పు గతాతఖానుండును ఫాజీలుఖానయొద్దయుండును
నబ్దులల్లీరాయండును నబ్దులకరీమును వీరలకుఁ గూరిమి
తమ్ముం డైనతసీరునిహాజరతి శేఖుబుదురుదిఖాదిరిని మదిం
దలంచు శేఖభరాముఁండును దనర్చిరి. 67

ఉ. ఇట్టి కొమాళ్లు రాసిరుల హెచ్చుగ మించినప్రోడ యేలికై
పట్టపుతేండ్ల మ్రొక్కుఁ గని పాటిలు నాయిభరాము
శాహు చే, పట్టి యనుంగుగా నడుపఁ బాయక మూఁడు
తరాలనుండి క,న్పట్టు నమీనుఖానుఁడు రసంబున మించె
ననంబు కల్మిచేన్. 68

## షష్ఠ్యంతములు

క. ఈగోనములఁ గడు మీఱుచుఁ
జాగపుమెఱవడిని వేల్పుజన్నియను నెలన్
వేగన్నులదొరప్రముఖుల
చేగం గైకొననియీగి చెలువపుశిబికిన్. 69

క. నిగనిగ మను*నెలకలు బలు
దెగలను వెలిపులుఁగుఁబదువుఁ దెలిమొగిలుగమిన్
దొగలన్ వగలం దగులన్
మిగులన్వాడి నవ్వనసపుమిసుములగమికిన్. 70

క. తనవారి మనుప మార్తురఁ
బనిపంపఁ గొలంబు నిలుప బలిమిని బుడమిం
దనరఁగ మానిసితన మూ
నిన కఱివేల్పునకు రాచనెలతాల్పునకున్. 71

క. గమకమున నెదురుపగతురఁ
గొమకుంబాయముల వేల్పుకొమ్మలఁ గడుఁజు
ట్టములఁగఁ గూర్చెడు నేరుపు
సమకూరిన రాయపక్షిసాళ్వంబునకున్. 72

క. పలుతలఁపుఁబొలుపగు తన
తలవాకిట నెపుడుఁ బలుకుతలిరుంబోఁడిం
బొలుపుగఁ గాఁపుర ముంచిన
మెలఁకువ గలనేరుపరి కమిర్ ఖానునకున్. 73

వ. సిరులుం గడు నమరు కొమరులుం గలిగి మనునట్లుగా నా

* నెలకలు = చంద్రకాంతశిల.

యొనర్పం బూనిన యబ్బురం బగునిబ్బలుకబ్బంబునకుం
బ్రావ యగుత్రోవ యొట్టి దనిన. 74

సీ. తగఁ గోటఁ దాచిన మగమానికంబుల
తెలిరంగు లెపుడు వెన్నెలలుగాయ
మేడలపై నాడుమెలఁతలుఁ దెలిగంటి
కొమ్మలు నేప్రొద్దుఁ గూడి తిరుగఁ
జిలువచామ లగడ్తవలినీటిపైఁ దేలి
యొరిమతో ననయంబు నోలలాడ
మేలిమిబంగారు మేలిపచ్చలడాలు
మిసిమి మింటికి నెల్లఁ బసిమి యొసఁగఁ
తే. జదల రాసినకొమ్మలచాలు కతన
మీఁద రారాక యలప్రొద్దు మెఱుఁగుఁదేలు
గవనులనె రాకపోకలుగా మెలంగఁ
దనరుఁ బుడమిఁ బ్రతిష్ఠాన మనఁగ వీడు. 75

క. పొడవగుబంగరుమేడల
గడువేడుక నాడుపడఁతుకల మొగములతోఁ
దడఁబడుదు నంచు రేలం
గడకడఁ జనుఁ జందురుండు కందుచు నచటన్. 76

చ. కనఁదగు తెల్లమానికపుఁగప్పుల నొప్పెడు చప్పరాలలోఁ
దనపొడ వైన నీడఁ గని తాళక యేనుఁ గటంచుఁ గొమ్ము
లం, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపుసింగపుం
గమిం, గనుఁగొని పాఱు వేల్పు దొరగారతఁ డాఁదల
మసరింపఁగన్. 77

మ. తళుకుల్ గుల్కెఱడు నందు మేడలతుదం దారొఱన్న బం
గారుకుండలు మిన్నేటను గానిపించుచును విన్నాణంపుఁ
దెల్వుం గడున్, విలసిల్లుం గని పైఁడితమ్ము లనుచున్
వేల్పుంబువుంబోండ్లు చేతులఁ దేరంజనఁ జూచి నవ్వుదురు
రంతు ల్గాఁగ జేజేదొరల్. 78

చ. దళముగ నందుఁ గోటలతుదం దవిలించిన మించుపైఁడిర్రా
తలకటికెక్కెమఁల్ గని యెద న్మెఱుఁగు ల్గల మబ్బులంచు
అంపిలి తగ నాడ నన్నెమలిపిండుఁ గనుంగొని చినఁఱఁ
గూటియ,పాలుఁగులు సంతసిల్లుఁ గడుపు ల్గడుసిండఁగ
నానుఁగోరుఱలన్. 79

క. అగడితలోఁ గెందామర
మొగడలు గనుపట్టెఁ జాల మూఁకై చూడం
దగి మున్నీటం దేలుచు
బెగడని వార్వంపుటగ్గిపిల్లలు వోలెన్. 80

సీ. మెఱసి పోవక నిల్చి మెలఁతలై యొఱపుచేఁ
దిలకించు క్రొమ్మించు తీవె లనఁగఁ
గప్పారుతొంగలిఱెప్ప లల్లార్పక
న్గవల నొప్పెడు వేల్పుటువిద లనఁగఁ
గడుసోయగంబుచేఁ బుడమిపై నడయాటఁ
బొలుచు మేలిమిపైఁడిబొమ్మ లనఁగ
సింగార మమరంగఁ జికిలిచేయించిన
వలరాచవానిపూములుకు లనఁగ
తే. నలువ తాఁ జేయఁగలిగినపొలుపుఁ గూర్చి
కరముఁ జేతులఁ బట్టినఁ గందు నంచుఁ

దలఁచెఁ గొమ్మలుగా నన నలరునట్టి
పువ్వుఁబోండ్లు దనర్తు రా ప్రోలిలోన. 81

ఉ. ఇంచుక కేల వాఁగె గుదియించిన సంద్రముదాఁటుచుం
జుమా,యించిన నేల గ్రక్కదల నిట్టటుగా వడిఁ ద్రొక్కు
చుఁ దువా,ళించిన గట్టు గుట్టనక లెక్కకు మిక్కిలి
దవ్వువాఱుచుఁ, మించినవారువంబు లట మీఱుచుఁ
ద్రిమ్మరు నెన్ని యేనియున్. 82

చ. ఎనిమిది తావులం దొడరి యేపుగ నెప్పుడు నాము జాఱఁగా
నెనయుచుఁ గెంపురేకలు షయిం బొలుపొందఁగ నందు
నేనుఁగుల్, తనరుచునుండు నాకసముదాఁకెడు నిక్కునఁ
జూప అబ్బురం, బన సెలయేళ్లతోడ నడయాడెడు జేఁగు
ఱుఁగొండలో యనన్. 83

సీ. బెళుకులై తళుకులు గులుకుకన్నులచెన్ను
కలువల కోకవింతచెలువు గొలుప
గొప్పలై యొప్పులకుప్పలై పాలిండ్లు
విరిబంతులకు వింతసరవిఁ గఱపఁ
బొలుపులై వలరాచబులుపులై పలు మొల్
మొల్లల కోకవింతమురువు నింపఁ
దళుకులై తేనెలు చిలుకుమోవులరంగు
చెందొవలకు వింతసిరులఁ జేయ

తే. సొలపు వలపును గొలుపు నిచ్చలపుఁ దెలుపు
నగవు మల్లెల కోక వింత నయముఁ దెలుపఁ
గోడెకాండ్రకు విరు లమ్ముకొందు రెపుడుఁ
బువ్వు లమ్మెడుచెల్వ లా ప్రోలిలోన. 84

సీ. నగఁగల్గినను జాలు మొగసాలవాకిలి
కాపించు నబ్బేసికంటి నైనఁ
జని చూడఁగల్గినఁ జాలుఁ జేయును నన్ను
కానిగాఁ బూవిలుకాని నైనఁ
బలుకఁ గల్గినఁజాలుఁ బనులు సేయించును
వెట్టిమైఁ జదలేటిపట్టి నైనఁ
జెనకఁగల్గినఁ జాలుఁ జేయును దనయింటి
చుట్టుఁ ద్రిమ్మర గాలిచూలి నైన
తే. నంటఁ గలిగిన నవ్వెనకయ్య నైన
గోఁచి విడిపించి వలపులు గొల్పి నిచ్చ
వెంటఁ దిరుగాడఁజేయు నవ్వీటిలోనఁ
గలుగు వెలయాండ్రగమి పొల్పువలనుఁ దిగిచి. 85

క. పలుకుల చిలువలదొర లన
నలుమొగములు పూని రానినలువ లనంగాఁ
దొలుమినుకులప్రోవు లన
న్వెలయుదు రవ్వీటి పుడమివేలుపు లెపుడున్. 86

సీ. వరుసవెంబడిఁ గాని పొరిగొనలేఁ డయ్యె
మార్తుర నాశాముమనికి యెంత
దురములో సిరిగేస్తు నెరసొచ్చి పగవారి
గొలిచిన కవ్వడియల వ దెంత
మూఁడుపాలెములు తెంపున గెల్చి పొదలు జా
బిల్లితాలుపు వేల్పు బీర మెంత
కోమటిసైదోడుఁ గూడి త్రిమ్మరి పేర్మిఁ
దగువిక్రమార్కునితెగువ యెంత

తే. నేలపై నిల్చి తమయేపు నిలుపలేక
బెడిదమునఁ బర్వు పిడుగులకడిమి యెంత
యనుచుఁ గేలిగ రచ్చల నాడుకొనుచు
నేచి పచరింతు రచ్చటిరాచవారు. 87

క. తడవఁగ వసమా యందుల
నెడపనిసిరు లేరికైన నెఱుఁగఁగవచ్చుఁ
నొడువక కోటికి నెత్తిన
పడగలచేఁ గోమటిండ్ల బంగరుమళిగల్. 88

క. గడితపుఁబిడుగుల నైనను
బెడిదపుసింగముల నైనఁ బెడచేఁ బుడమిం
బడనడుచుబంటు లెన్నఁగఁ
గడలేక తనర్తు రచటఁ గడుబీరమునన్. 89

వ. ఇట్లు కడలికడగాఁ గలుగు పుడమిపడఁతికిఁ దొడ వనం
గడునొప్పు నవ్వీ డేలునేలతేఁ డెట్టివాఁ డనిన. 90

సీ. విన్నేరు తలఁగల్లు వేల్పునౌఁదలపువ్వు
తలఁప నెవ్వనితాతతాతతండ్రి
కలువలచెలికానిగాఁరాపుఁబట్టి యై
తనరారు నేతేనితాతతాత
దీవులు పదునెన్మిదింటితో నేలయుం
తయు నేలె నేతేనితాతతండ్రి
తనయాన సుడిగట్టు వెనుకఁ బర్వఁగఁ జాలఁ
దేజునమించె నేరాజుతాత

తే. చేరి జేజేలు మఱి జడదారిగములు
నచ్చరలు గొల్వ వేఁగన్నులతని మొదలి

రాచనెల వేలెఁ బేర్మి నేరాజుతండ్రి
యతఁడు గొనియాడు నెగడె యయాతి పుడమి. 91

సీ. తనవాలుముక్కంటికిని మార్తు రగు రాచ
గములెల్లఁ బూవిలుకాండ్రు గాఁగఁ
దనరూపునలకుఁ బైదలులనెమ్మదు లెల్ల
మేలైనబేడిసమీలు గాఁగఁ
దనయీగితోగతేనికిని వేఁడువా రెల్లఁ
దులకించుకల్వఁ తుటుము గాఁగఁ
దనగెల్పునట్లప్రాఁతలకు మున్నీటి మ
వ్వాల నున్నసుడిగట్టు నలక గాఁగఁ
తే. దనదు తేజు జగంబనఁ దగినతమ్మి
కొలకునకుఁ గోర్కులిడు వేఁడివెలుఁగుగాఁగ
గడలి లోఁగొనఁగల్గిన పుడమియెల్ల
నానకును లోనుగా నేలె నయ్యయాతి. 92

చ. అనికి నెదుర్పఁజాలుదొర నారసి కానక యయ్యయాతి
దాఁ, బెనఁకువ మేటిజన్నములు పెక్కులు చేసి పసిండిఁ బా
ఱులం,దనుపఁగ దాని నిచ్చు నని దయ్యపుమూఁకలు పైడి
కొండపై, ననయము గాఁపురంబులుగ నన్నియుఁ గాచుచు
నుండు నెంతయున్. 93

చ. తోఁటలు లేనితోవలును దోరపుజన్నపుఁగంబము లఘు
న్నాఁటనియేటిపెందరులు నాడెపుఁబాఱుల కీనియూళ్లు నీ
రాఁటనిగాటపుంజెఱువు లారయ నబ్బుర మెంచి చూడ
న, మ్మేటియయాతి యేలుపుడమిందగునబ్బ లియుం దలం
పఁగన్. 94

సీ. తలఁపఁడు జేజేలుఁ బొలసుఁదిండ్లును గొండఁ
గలఁచిననాఁటియంకిలి యొకింత
యెఱుఁగఁడు తనలోన నేప్రొద్దుఁ బాయక
యేర్పవార్వపుటగ్గియెగ్గు మదిని
మఱచెఁ జాల్వేరింటిమగువ నేలినవేల్పు
చిలుకువేఁడిమి నింకి కలఁగఁబడుట
యెఱుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్క
గొనినయప్పుడు గల కుతిలపాటు
తే. నయ్యయాతి గడంగి నెయ్యమునఁ బుడమి
వేల్పులకుఁ బైఁడి యొసఁగెడువిడుపునీట
నిండి కొఁద వేమియును లేక యుండెఁ గడలి
యతనిచాగంబు లిఁక నెన్న నలవి యగునె. 95
క. ఆరాచవేల్పురాయఁడు
వేరపుఁబే రెందు నైన వినఁబడకుండం
దోరముగఁ జిల్వతేనికి
నూరటగాఁ బుడమిఁ దాల్చి యొకనాఁ డంతన్. 96
సీ. పదియాఱువన్నెలపసిఁడిగోడల *చెంతఁ
దిర మైన కస్తురితీనియలును
బాఁపమేఁపరిపచ్చపలకలఁ జెంగల్వ
దోరటాలఁ దీర్చిన దూలములును
మగమానికంబుల తెగల బోదెలచేత
పగడంబుగొప్పకంబములగములుఁ
బెద్దతామర కెంపుబిగిపట్టియలచేత
సొబగైన ముత్యాలసోరనములు

---



* గోడలచేత - పాఠాంతరము,

తే. వాసి యేనుంగుకొమ్ములఁ జేసినట్టి
బోరుతలుపులచేతఁ గప్పూరపుఁబసుల
యరఁగులును మించుకొల్వునుప్పరిగెలోనఁ
బరఁగు గొజ్జంగిచల్వచప్పరమునందు. 97

సీ. అలవేల్పుదొర పంపినట్టి తలంపుటా
పనియడపం బొక్కపడఁతి దాల్పఁ
జెలిమితోఁ దామరచెలిపట్టి యనిచిన
బలునరంజీ యొక్కచెలువ పూనఁ
గడఁగి గాడుపుతేఁడు కానుకంపిన తెల్ల
వీచోపు లిద్దఱు వెలఁదు లిడఁగఁ
బైఁడిఱాయఁడు కూర్మిఁ బనిచిన నెత్తమ్మి
కెంపుగిండి యొకర్తు కేల నలమ

తే. వెండియును నేలచెలఁగుల నుండు రాజు
లరికి నిచ్చినకన్నియ లడఁకువలను
గదిసి కట్టడ యగునూడిగములు సేయఁ
బచ్చసింగంపుగద్దియపైఁ జెలంగె. 98

క. మానికపుసొమ్మురంగులు
పూనిక నరుదైన మేనిపొలుపునకుఁ గడుఁగా
మాననియారతులై తగఁ
దా నొకమరుఁ డనఁగ నెఱపుఁదనమున నొఱపై. 99

సీ. ఆహా! పరాకు! విదేహునికాను కీ
సొబగైనయట్టి కస్తురిమెకంబు
లెచ్చరికయ్య మాహిష్మతియేలువాఁ
డనిచినాఁ డీచిన్ని యలరుఁబోండ్ల

నవదారు! కుంతలుం డంపిన వీయాము
　　పొగరుచే మీఱు నేనుఁగులగములు
చిత్తగింపుము! సామి! సింధురా జంపెను
　　వడిమీఱునీమేటివారువముల
తే. ననుచుఁ బేర్కొని కటికవాం డ్రగ్గలంపు
రవళిగాఁ జూపి తెలుపఁగాఁ దవిలి వాని
నల్లనల్లనఁ గనుఁగొంచు నుల్లసిల్లి
యపుడు పేరోలగం బుండె నయ్యయాతి. 100

వ. అంత. 101

సీ. గురివెందపట్టెళ్లకును దోడు సందిళ్ల
　　బీలిదండలు గూర్చి చాలఁ దొడిఁగి
యెడనెడఁ బికిలిపూ లిడినసంకులపేర్లు
　　కోరెందపూసలఁ గూడఁ దాల్చి
గుఱుతుగా మెఱయు జేగురుబొట్లమీఁదఁ దం
　　గేటిపూఁబోరలు రాగిల్లఁ దాల్చి
బరువైన పాలులాకులబొట్టదట్టీల
　　దిండుగాఁ దీ గెలపిండు చుట్టి
తే. కుఱుచచేతులు మిడిగ్రుడ్లు కఱకుమీస
లిరులు గ్రమ్మెడు మేనులు నిరుకుబోర
లేఁచమాటలు జడగొన్న పీఁచుఁగురులుఁ
గలుగ నెఱుకులు దగఁ బొడఁగనఁగ వచ్చి. 102

ఆ. పికిలిపూలు బూతపిల్లు లేనికకొమ్ము
లలరుఁదేనె పెద్దపెలఁగపండ్లు

వెదురుఁ బ్రాలు ఊతివదనికల్ గసగసాల్
జల్లి మెకపుఁజాలుఁ జాఱపప్పు. 103

మ. పులికూనల్ సవరాలుఁ గస్తురిమెకంబు ల్లేళ్లుఁ గుందేళ్లుఁ
బం,దులుఁ గారోప్పితు లెలుంగు లేదులును మన్నుంబిళ్లుఁ
జివ్వంగిపి,ల్లలమొత్తంబు జవాదిపిల్లులు మొదల్గాఁ గానలో
వానిగుం,పులఁ గై కానుకచేసి యాఁదలల మోడ్పుంజేతు
లం గూర్చుచున్. 104

వ. చాఁగి మ్రొక్కి లేచి యి ట్లనిరి. 105

సీ. కొండమల్లయ్యచే నుండు నందురు గాని
జింకను గాన మేవంక నైన
నొకటియాజమునకు నున్న దందురు గాని
కాతెనుపోతును గాన మెచట
నలకంబమయ్య తానైన దేమోకాని
సింగ మొక్కటి యైన సెలల లేదు
గాలిదేవరకును గల దటందురు గాని
యిట్టి నొక్కటిఁ జూచి యెఱుఁగ మెందు

తే. హాళి నేఁటేఁట మీరు వేఁటాడుకతన
నిప్పు డేఁడాదిగోల్ సామి యేగుదేమి
నేలయీనిన తెఱఁగున నోలి నెపుడుఁ
గడమి నెడయీక తిరుగు మెకంబు లడవి. 106

తే. చేలుఁ బోళ్లను బీళ్లను జేరి చొచ్చి
పైరుపచ్చలు మేసి యప్పాటఁ బోక
పల్లియలు సొచ్చి తోఁటలు పాడుచేసి
కావరంబునఁ గదుపులై గాసి చేయు, 107

క. ఏఁటికిఁ జెప్పఁగ సామీ
మీఁటినఁ జము రొలుకునట్టి మెగములు మిగులన్
గాటమ్ము లైనయమ్ములు
నాఁటక తిరుగాడుఁ బొలము లన్నియుఁ దామై. 108

వ. అని విన్నవించు చెంచులవిన్నపం బాలించి సంతసంబున
వారికి నుడుగర లిచ్చి నేఁడు వేఁట యని వీటం జాటఁ
బడవాళ్లం బంచి పేరోలగంబు విచ్చి కొలువువారల ననిచి
ననుచుసంతసంబునఁ దననగరికిం జని తగుపనులు దీర్చి
వేఁటకు నంగగు సింగారంబునం బొంగి బేరులు మొద
లుగాఁ గలుగు నిద్ధంబులగు వాయిదంబుల పెన్రవలి దవిలి
నేలచెఱంగులయేనుంగులచెవులకుం జెవుడు గొలుపఁ
బౌఁజులు నడువం బుడమిం బొడము దుమ్మునం గ్రమ్ము చిమ్మ
చీకట్లు నడిదంబుల బెడిదంపుఁజాయలు విరియింపనొక్కవారు
వంబు నెక్కి వెడలె నప్పుడు వేఁటకాండ్రు నాయితం బై.

తే. లేఁటివలలును మేటికుందేటివలలు
నెలుకవలలును సవదండవలలు దొడ్డి
వలలుఁ బందిటివలలును బలువు మఃకిల
వలలు మొదలుగఁ గలిగిన వలలు మఱియు. 110

క. ఉద్దవిడిఁ గవియుకుక్కలు
గద్దఱి సివ్వంగులిర్లు గడునేచిన మే
లెద్దులు మొదలుగ వేఁటకు
దిద్దినయవి ప్రోఁగుఁద్రాళ్లుఁ దెరచీరగముల్. 111

క. బలువైన వేసడంబులు
జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గి

ద్ధులు మొదలుగఁ గలవిడివేఁ
టలపులుఁగులు పదనుతో మిటారింపంగన్. 112

ఆ. కాఱుకోడి క్రౌఁజు కక్కెర పూరేడు
కేరజములు మఱియుఁ బేరుగలుగు
చింద మొదలుగాఁగఁ బొంది వేఁటకు మీఱు
పిట్టలెల్ల గూళ్ల బిట్టు చెలఁగ. 113

క.*మరి తెరలుఁ జిక్కములు వం
కరబోనులుఁ ద్రాళ్లు నురులుఁ గాలురులును జే
గురుగండెలుఁ దలముళ్లుఁ
గరిచిలుకులు విండ్లులోనుగాఁ గొంచు వెసన్. 114

వ. వేఁటకాండ్రు కొలిచి నడువ సంతసంబునం గొంత దవ్వరిగి
యంతట బలుమూఁకల మెకంబుల సిలుచునట్లుగా నేమించి
వేఁటకుం దగినపాఁజులతోఁ జని ముందట. 115

సీ. నింగి బీటలువాఱఁ బొంగు సింగంబుల
రవలిచే దెసలెల్లఁ జెవుడుపడఁగఁ
బొలసుదొబ్బల నుబ్బుపులుల పెనొబ్బలఁ
గడలియుఁ బలుమాఱుఁ గలఁగి పొరల
వీఁక నేనికమూఁక విఱుచు ప్రాఁకుల ప్రోఁత
పెటపెటల్ మలల నిట్టటుగఁ జేయ
మీఱుచు నేట్లాడు కాఱుపోతుల కొమ్ము
చప్పుళ్లఁ బులుఁగులు కుప్పఁగూల

తే. గొరగొరం జను పందుల ఘుర్ఘురంబు
బెడిదములఁ బుడమియు వడవడ వడంక

* ఈపద్య మొక ప్రతిలో లేదు

నెపుడు నెడయాని చీఁకట్ల నివముగొనుచు
నొంటిఁ జొరరానియట్లుగా నుండె మఱియు. 116

తే. ప్రొద్దుచాయలు దూఱక పొళ్లు చేసి
యిసుము చల్లిన రాలక యిరులు గ్రమ్మి
నడువఁగా రానియొక్క కారడవి నపుడు
కాంచి వెఱఁగందె నారాచకలువ ఱేఁడు. 117

వ. ఇట్లు కాంచి వెఱఁగందుడెందంబున నయ్యడవిం గొంతద
వ్వరిగి ముందట. 118

సీ. అలరుకస్తురిఁ దీనె లలికి వాకిళ్ల చెం
తలవైచిపోయిన తట్టుపునుఁగు
గోడలు పూయంగ గ్రుమ్మి గందంబున
మేదించినట్టి జవ్వాదియడుసు
నాడాడ సరిబేసు లాడి పోవిడిచిన
ముదురువెదుళ్లలో ముత్తియములు
బలుపు లేనికకొమ్ముటలవలపైఁ ద్రోవఁ
దవిలించి కట్టిన సవరములును

తే. వంటకట్టెల కని తెచ్చి వాము లిడిన
యగరుమ్రాఁకులపై నిండ నాఱఁబెట్టు
కప్పురంపుటనంటులు గలిగి మెఱయు
నెఱమఁపల్లియ లొకకొన్ని యెదుటఁ గాంచి. 119

సీ. చెవుల కీలెల్లయుచ్చితకాయ లెంతేసి
పారుటాకులది కుప్పసమి దప్ప
అయ్యకుఁ గట్ట నెంతరఁటాకు గల్గెరా
యీపచ్చతాడిబి ళ్లేడదొక్కొ

బెంచుల ప్యక్కా వేమలు. పూరి తెలుగు పలు లమేలకులు
ఎటువారు ప్యది వేయిలు
జీవిపలవి నేని లోపేక్కు

వ్రేళ్లఁజుట్టిన వెట్టివేళ్లకో చేతులఁ
బండుఁడీఁగెలవి గొప్పలు కడేలు
తలకు వేసికలో తాల్చిరి యీలాగు
నీయచ్చుగురిజపే రెండుఁ గలిగె
తే. రాజు కాఁ డన్న కంబము రాయఁ డితని
వేసమును మేలు బాగెము సేసియుంట
నిపుడు గనుఁగొంటి మనిపల్కు నెఱుకుదొరల
ముగుదమాటలు విని చాల నగుచు నలరి. 120
వ. చనుచున్నెడ నిచ్చోటు వేటకు వాటం బని వేటకాండ్రు
విన్నవించుమాట లాలించి వేఁట వెట్టు మని పుడమిఱేఁ
డానతిచ్చిన. 121
చ. దురమున వారువంపుగమి ద్రొక్కఁగ లేచిన దుమ్ము గ్రమ్మి
నన్, బురదయి యుండునాకడలిఁ బూనిక నేనిక మూఁక
రేసి వేఁ,మఱు బుసకొట్టఁగా నెగయు మవ్వపుఁదుంపురు నీ
టిచేత రా, సిరిపయిఁ గూరిమిన్ మగుడఁ జెల్వుగనించిన
యాభగీరథా. 122
క. తెలివిం బుడమిం దగుక
ల్వలరాయా మైఁదనర్చు వలరాయ! కడుం
గలనైన వీఁ గెలుంగక
కల నైన న్మెఱయు పెంపుగల ముక్కంటీ! 123
మత్తకోకిల. పోరులం దెగి నీదుమార్తురు ప్రొద్దు నెన్నడు
మొక్కటం, జేరి బల్విడిఁ దూఁటి బంగరుచేలయు న్సిరితోడి
సిం,గారము న్నుడివాలుఁ జిందముఁ గల్గి సొంపుల మీఱు
చున్, రారు నేలుపుఁజాన లిండ్లకు రాసిరిందగు నేర్పరీ. 124

గద్యము. ఇది శ్రీమదనగోపాలమంత్రప్రసాదలబ్ధసారస్వత సుకవి
జనవర్ణనీయవచోవిభవ భావనామాత్యతనూభవ పొన్నికంటి
వంశ్య తెలగనార్యప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ
తెనుఁగు కబ్బంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము

క. సిరివంటి బడేబీబీ
సురిఁబోఁడికి వెన్నుఁ డనఁగ వెలయుచు మిగులన్
గరగరికలఁ దనరెడు రా
సిరులందు నమీనుఖాన చెలువములగమీ! 1

వ. అటమీఁద తెఱంగు వినుండు. 2

సీ. కంబమయ్యరో మేలు గలిగించు నీకొక్క
గరుటాలమంతునిఁ గాను కిత్తుఁ
గాశ్రేడ మెకములకదుపు రాఁజేయుమీ
జింక నొక్కటి నీకుఁ జేతి కిత్తు
మలలమ్మ వేఁటలో మాపాలఁ గల్గుమీ
సింగంపుఁగొదమఁ దెచ్చెదము నీకు
దుగ్గమ్మ కాఱుపోతుల లోనుజేయుమీ
తొలిముద్దగా నిత్తు దంత నొకటి
తే. యనుచుఁ దమవేలుపుల నెల్ల మును దలంచి
వేఁడఁకొని మ్రొక్కి వాకట్టుప్రేళ్లు గొనుచు

వలను లెస్సైన మిక్కిలి నలరుకొనుచు
వచ్చి యెఱుకులు వేఁటాడఁ జొచ్చి రపుడు. 3

క. ఘునువడిన మెకముఁ గొని చని
కనుగ్రుడ్డు పెకల్చి నెత్తి గడిగి కటారిం
గొని తోఁక పొడిచి యొకఁ డా
ననఁగ సురాళించె నయ్యయాతికిఁ గడఁకన్. 4

వ. అంత నెఱుకులు కఱకుంబలుకులు చెలంగఁ బేర్చియార్చిన.

తే. తొలుతమ్రింగిన కొఱనెలల్ సెలవులందుఁ
గడఁగి వెడలించు నెలదిండిగాము లనఁగఁ
గొమ్ము సందులు వెడలె ఘుర్ఘురము లడరఁ
బొదలలోనుండి యప్పు డార్పులకుఁ గాఁక. 6

క. పొద లట్లు వెడలు పందుల
కదుపులఁ బట్టెడలు దిగిచి కవియించిన బె
ట్టిద మైనజాగిలంబులు
చెదరక డాయంగఁ జూచి చెంచులు కడఁకన్. 7

క. వడి నుసికొలుపుటయును నిరు
గడల న్వేనువంకఁ జేరి కఱవఁగఁ గినుకం
గుడియెడమఁ దిరుగు నెడమం
గుడిదిరుగున్ సాగి పోక గుటగుట లడరన్. 8

ఉ. అంతట నొక్కచెంచు కడు నగ్గలికం జని పందిపోటుమై
చెంతకుఁ బోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తఁ
బంది నిం,తింతలు చెక్కలై పడఁ బయిం బడి నొంచెఁ
బిడేన దానిక్రొ,వ్వంతయుఁ గాఱె కాఱె యచటాఱక
నేతను దోఁగునట్లుగన్. 9

ఉ. కుక్కల నొంపఁ జూచి మఱికొందఱు కొన్నిటిఁ గొంగ
వాలునం, బ్రక్కల చించినం గదిసి పైఁబడి కొమ్ముల వారి
నందఱం, జెక్కలు చేసినం గడలఁ జెంచులు వే జముదాళ్ల
బందులఁ, ద్రొక్కలువాపి రన్నిటిని వండఁగఁ జెండిన
మాడ్కి నుండఁగన్. 10

చ. ఎదురుగఁ బీఁటవెట్టుకొని యెవ్వరిఁ జేరఁగ నీక నల్గడం, గది
సిన కుక్కలం దునుమ గద్దఱిపంది నొకండు వెన్ను చే,యద
రక ముప్పిడిం బొడిచి యంటఁగఁ బట్టుచుఁ గోఱఁగొట్టిన,
న్నైదలఁగనీక తెచ్చినను మెచ్చులొసంగెను రాజు వానికిన్.

సీ. వేల్పుమున్నీరికై వెఱచి పెన్బొదలలో
నొదుఁగుకాటుకకొండకొదమ లనఁగఁ
బ్రొద్దునకై లోఁగి పోయి సందుల డాఁగి
బెదరి వెడలు నిర్లపిల్ల లనఁగ
నచ తెల్లఁ దమచాయ నంటినట్లుగ నుండఁ
దిరుగులాడెడు నీలితిన్నె లనఁగ
నడవిమున్నీరంచు నరుదెంచి పోలేక
పూని త్రిమ్మరు మబ్బుకూన లనఁగఁ
తే. దావిగుబ్బలిదెస యేలుదేవ రలిగి
పుడమిఁజూపిన తనబంట్లపూఁప లనఁగఁ
జూడ మేనులు గరుదాల్పు చొప్పు గలుగు
నెలుఁగులను జూచి మది నుబ్బి యెలుకు లెదిరి. 12
క. పడి నొక్కయెలుఁగు చెంచులఁ
గడచి తనుం బొదువ వచ్చుగద్దఱియెలుకన్

మెడ వట్టికొన్నఁ గ్రిందను
బడి ముప్పిడి నతఁడు బోరఁ బగిలిచి నొంచెన్. 13

క. దానిఁ గని వచ్చి పైఁబడు
వానిని బల్లెములఁ గొంగవాలుల సురెలన్
మేనులు వ్రాలిచి పెంపున
ఱేనికి సంతసము చేసి ఱేసిరి కడఁకన్. 14

వ. అప్పు డొకకొందఱు. 15

ఉ. చెంగటఁ బాఱులేళ్లఁ గని చేతుల సన్నల నెడ్ల నిల్పి సి,వ్వాం
గులబండ్లు డించి తగ వానికిఁ గన్మఱుఁగు ద్దెరల్చి యా
ముంగలఁ బాఱఁ జూపుటయు మున్పుగ నాయుచుఁబోయి
చేరువం,జంగున దాఁటి పై కుఱికి చంపి కలంచెను వాని
నన్నిటిన్. 16

తే. పెంపుటిఱ్ఱులు కినుకలు పెనచి పోయి
కొమ్మునుచ్చులఁ దగిలించుకొన్న నరిగి
రాజు చూడఁగఁ జెప్పంగరాని కడిమి
నీఁటియలఁ గ్రుమ్మి నొంచిరి లేఁటిమగల. 17

క. ఎద్దులు మఱుఁగులుగాఁ జని
గద్దఱులై చేరు పెన్మెకంబుల నాలో
నుద్దవిడి నొంచి రలవున
నద్దిరయని యయ్యయాతి యబ్బురపడఁగన్. 18

క. మిడి బోనులఁ గాలుచ్చులఁ
బడఁదోలియుఁ బోఁగులోను పఱచియు లేళ్లన్
వడిగల జింకల నెల్లం
బొడిచిరి కడుఁ జెంచు లాఱుపులఁ జద లదరన్. 19

వ. అప్పుడు. 20

ఆ. పాదివేఁటఁ జూడఁ బదరెడు రాతేని
మది యెఱింగి తడవు మనిన వెలిచె
క్రౌఁజు కారుకోడి కక్కెర పూరేడు
చింద లున్న గూళ్లు చేరఁదెచ్చి. 21

క. ఎడఁ గలుగఁ బెట్టి తలుపు
ల్విడ నవి గావించు రవలి విని చని గూళ్లం
బడుపులుఁగుల నుసులులతోఁ
గడు వేడుకఁ దెచ్చి యొకఁడు కానుక చేసెన్. 22

తే. అపుడు నిడివేఁట యిడుమని యానతిచ్చు
రాజుముంగలికడఁకుఁ జేరంగవచ్చి
లగుడు సాళ్వంబు డేగ లోనుగను గల్గు
వేఁటపుల్గుల విడిచిన వింటి కెగసి. 23

సీ. కొక్కెరపూరేడు గొఱవంక లావుక
పొన్నంగి కోవెల కన్న లేడి
బెళగువ్వ బాతులావిల మాసతఃపుడు
గాఁడు నెమలి పాలకాకి చిలుక
బలితపువెలిచె పావళము తీతువు చింద
కక్కెర యేట్రింత కారుకోడి
క్రౌఁజు బెగ్గురు నీరుకాకి కంకణమును
బొంగ దాబయుగువ్వ వంగపండు
తే. మొదలుగాఁ గల్గువానిని మెదలనీక
కదిసి నున్గొళ్లకొనలను గుదిచి పట్టి

పొదలుచును తేనిమదికి నింపొదవఁజేసె
నెలమి నప్పుడు విడివేఁటపులుఁగులెల్ల. 24

తే. అంత నారాచవేలుపుహాళి యెత్తేఁగి
కడిమితోడుత నవ్వేఁటకాండ్రు కడఁగి
పొడవులై యుండు లెఱలెత్తి పోఁగుదీర్చి
బలుమెకంబుల వలలందుఁ బడఁగ నార్చి. 25

క. పిడుగులచప్పుడువడువునఁ
గడురొప్పెడు మెకపుగద్దికల కలుకకయే
కడలవెడలంగ నీయక
పొడువఁగ నారవలి నింగి బోరుకలంగెన్. 26

శా. రాజేంద్రుల్ బలుపైన వేఁటతమిచే రాగిల్లి కెంగేలిపై, నేజా
ద్రిప్పుచు లాగి వాగె బలిమిన్ దేయంచు నొక్కుమ్మడిం,
దేజీఁదోలిన ముందువెన్కఱుగ కెంతే బీతు లోఁబ్రుంగి తా,
మేజాడం జనఁగా నెఱుంగ కొదిఁగెన్ హెచ్చైచ మెకంబు
లై్వసన్. 27

వ. ఇట్లు గాలిం గేలికొను సురవడి మెఱవడి గారవంపు వారు
వంబు నదలించి తెరలోనికిం గదలించి. 28

క. పొడిచిన నేజావెంటనె
వడిఁ బైకొని చౌకళించి వచ్చినపులుల
న్నెడలెడలించెను బెడిదపు
టడిదంబున నేల గప్పినట్టుగ నుండున్. 29

క. ఆపగిది ప్రేసి యుడుగక
యేపున సింగిణికి నారి యెక్కించి వడిం

గోపుల బెబ్బులులం గని
తూపులకు న్వానినోళ్లు దొనలుగఁ జేసెన్. 30

మహాస్రగ్ధర. అనుకుంజూపు ల్దగం దా మడుగులు పుడమిన్
హత్తనీకేగులెల్లం, గని తేజీఁ దోలి యంటం గదుముచు
మెఱుఁగుల్ గ్రమ్ముచుండంగ మున్నే, సినతూపు ల్వెండి
యొంటం జెలఁగుచుఁ దునుకల్ చేసి చేనేర్పుమీఱం, దన
వాలుంగంటికన్నుల్ దలఁపుచు మదిలో దాఁచియున్నట్టి
కూర్మిన్. 31

స్రగ్ధర. తుండించె న్మన్నుఁబిల్లం దునిమెఁ గణుదులం ద్రుంచెఁ
జివ్వంగిమూఁకం, జెండాడెం గొండగొర్లం జెలిగనెలుఁగులం
జించెఁ గార్పోతుల న్మై, కండల్గాఁ జేసె నిర్లం గలఁచెఁ జిఱు
తలన్ గండ్రికల్ చేసి నేల, న్నిండించెన్ దుప్పులం బన్నిద
మున కొకటి న్లేకయుండంగ నచ్చోన్. 32

క. ఇటువలె వేఁటాడెడుతఱిఁ
దటుకున నొకయిఱ్ఱితెరలుదాఁటి వడిం జెం
గట నుఱుక నెఱుకుదొరలా
ర్పుటయున్ ఱేఁడలుక దానిచొప్పున నొంటిన్. 33

వ. చనం జన ముందట. 34

సీ. చల్లనితలఁపుటాబల్ల మీఁదటఁ జిల్ల
జీఱ్కులాడెడు వేల్పుఁజేడియలును
దమపాటఁ గరఁగు నిద్దపుటాలునీటనం
దఱునోలలాడు కిన్నరులగములు
గవులజేజేనన్ను కొండ్రతో వలరాచ
మచ్చికఁ బెరలాడు నచ్చరలును

బచ్చలగనులపైఁ బసిమి పచ్చికయంచు
వడి మేయవచ్చిన పుడుకుఁబసులుఁ
తే. గెంపునెలవులుగాంచి యుంకించి తమ్మి
కొలఁకు లని వచ్చి కాకున్నఁ గలఁగి యపుడు
మగుడ నేఁగెడు నంచలఁ దగిలిపట్టి
మెలఁగు తెఱగంటి కొమిరెలుఁ గలిగి మఱియు. 35

సీ. బెట్టుగా నడివంకఁ జుట్టివచ్చిన మబ్బు
వెలయు నేనికతోలు వలువ గాఁగఁ
బైనుండి క్రిందికిఁ బర్వు జేగుఱు టేఱు
లొడలవ్రేలెడు పల్ల జడలుగాఁగ
నెత్తంబు క్రిందటి నెత్తమ్మి కెంపుఱా
గని పెంపు వేలిమికన్ను గాఁగ
ననయంబుఁ దొరఁగి పేరినమంచు వెన్నెలల్
చిలికెడు నెమ్మేని తెలుపుగాఁగ
తే. నెపుడుఁ బాయకయున్న మిన్నేఱు దనరఁ
బేర్మి గొండలఱేఁడను పేరు మెఱయ
వేల్పుమలవింటిదేవర పోల్పుదాల్చి
జన్నపుందిండివిడిమట్టు చలువగట్టు. 36

ఉ. మించినయామము టేనుఁగుల మీఁదికిఁ జెంగున దాఁటి యా
దలల్, చించిన గోళ్లలోఁ దవిలి చిందిన ముత్తెములెల్లఁ
జట్లపై, మంచునఁ జేరి దాకొనిన మాటికి నమ్ములఁ ద్రవ్వి
త్రవ్వి య,చ్చెంచు నెలంత లేఱుదురు సింగపుఁజాడ లెఱింగి
యచ్చటన్. 37

క. వలిగాలి నెఱుకుబిడ్డలు
నెలవులకడ కెంపుఱాలు నిప్పుక లనుచుం
జలిగ్రాఁగఁగ వత్తురు త
ల్లులచంకలు డిగ్గి నిచ్చలుం దగ నచటన్. 38

ఉ. విన్నన నేరుతామరలవిందుకిలాతపు నీడ లెప్పుడున్
వెన్నెలరాచఱాలఁగని వెళ్లక నీళ్లమునింగి యున్న వీ
మన్ను లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ములనేసి నాటమిఁ
మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁబోవుదు రిండ్లపట్లకున్. 39

వ. మఱియు జూఁకఱ మరులుగొలుపుచు మరునియురులసరులై యిరులుకొను కఱకుఁజిఱుకుఁజూపుల కోపులవలపులు గొలుపు నెఱుకుటిఱుకుఁగుబ్బెతల విప్పుఁగప్పులగొప్పులయొప్పులు గని తెమలి నెమలిపించంబు లనుచు వెఱచి పఱచి యందపు గందపుమ్రాఁకులమోఁకలఁ బెట్టుఁ జుట్టుకొను చిలువలతలల మినుకులకునుకు లగుమానికంబుల రంజిలు కెంజాయ చిగురని పొగరున నెగిరి వచ్చు కోయిలలును వడివడి మీఁదికడ నడరుచు బీరపుఁగుప్పలై తిప్పలకుం గొప్పలగు దప్పులకుం గాక బెగ్గిలి నేలకు డిగు పెంజిలువలుం బోలె మలల చఱుల మలకలై జాఱుసెలయేఱులును జలువనెలవు లగు కలువరాచఱాచలుపలపైవలపుతోఁ బడుకొలఁకుల కెలఁకులం దగు మొగిలు తెర యొరలమఱుంగునం గరంగుచు మగువల బిగువుంగవుంగిళ్లఁ జొక్కు జక్కవలపెక్కువలును మురువులై సింగంపు జంగిలి కిరవులై విరువులగు నరవలం గరువలిమేపుడువొరపడగలపై నిగుడు సొంపులగకెంపుల రంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన

మించు తలిరుమ్రాఁకులునుం గలుగు నగ్గుబ్బలి సోయగంపు
టుబ్బునకు మై నిబ్బరికింప నబ్బురపడి యబ్బలియుండు
తనలోన. 40

మత్తకోకిల. నీటి పుట్టుగుపట్టి యెన్నఁడు నెమ్మిఁ గానఁగ లేని
య,మ్మేటివేలుపు రాయఁ డామరుమేపుకందొర మామగా
నేటి నీటుతపంబు సేసెనొ యీవడంకుమ లంచుఁ దా
మాటికిం గొనియాడుచుం జని మన్నుతేఁ డటముందటన్.

సీ. ఉబ్బు బుగ్గలు గబ్బిగుబ్బలు గాఁగ బి
త్తర మైన తరగలు తరులు గాఁగ
జాలగు తోఁగలు ముత్యాలపేరులు గాఁగ
మురువగు వెలిదమ్మి మోము గాఁగ
దోరంపుఁదామరతూండ్లు చేతులు గాఁగ
నలతేఁటిచాల్పు నూగారు గాఁగఁ
బలులోఁతుసుడియె పొక్కిలి గాఁగ మిక్కిలి
కొమరైన చిందంబు కుతిక గాఁగఁ
తే. గప్పు గల నాఁచు గొప్పైన కొప్పు గాఁగ
మేఁతలిడు నంచ లిరువంక మూఁతి గఱవ
రాణ దిలకించు పూఁదీగె వీణెగాఁగఁ
బలుకు కొలనాఁగయును బోలె నలరి మఱియు. 42

సీ. ఇసుమునఁ గావించి యెఱఁది జాబిలితాల్పుఁ
దగఁ గొల్పు నజ్జడదారితుటుము
గాలి యొగిరముగాఁగను నీటిలోనఁ ద
బము లొనర్చెడు నిరాభారిగములు

నేచవు ల్గును మాని లోఁగూపుగా మిన్ను
కడలఁ దోఁచు వెలుంగుఁ గాంచువారుఁ
గ్రుంకి యానీటి కెలంకు లందును వన్నె
మ్రుగ్గువెట్టెడు వేల్పు ముద్దియలును
తే. బసిఁడి వేఁడెడువారికి నొసఁగ వచ్చి
దరుల నిల్చిన జేజేలదొరలుఁ గడల
నడవిపనుపులు మెదిచి పై నలఁదు తబిసి
కన్నియలపిండు నెంతయుఁ గలుగుదాని. 43
సీ. తులకించు వేలుపుదొరలకేళాకూళి
పసిఁడి కెందమ్ముల పంటచేను
జొట్టు నట్టువ తేజిజోదుఁ గాంచిన దంట
సగరులేగిననాఁటి ముగితిత్రోవ
బెడిదంపుజడదారితోడఁ దూఱినవలంతి
వలువవారువములు చెలఁగుచోటు
జగములు మూఁటిపైఁ జంగజాఁచినజాఁగ
సుడుగుల చెలిమామయుడుగుఁ జెమరు
తే. సరగఁ దనుఁ జూచు వారి కెవ్వరికి నైన
మలబిడారును మలకల నలరుపేరు
బంట తేరును వేలిమికంటి తీరు
నొసఁగుప్రోడయునై చాల నొనరుదాని. 44
క. రంగుగఁ జూపఱకోర్కు లో
సంగఁగ దోసంబు లడఁపఁ జను దెంచిన యా
గంగం గని మై యెల్లను
బొంగం దగ మ్రొక్కె రాచపుట్టువు మదిలోన్. 45

సరసిజవృత్తము. కప్పఁగఁ దోలుం గొప్పునఁ జాలుం గనువిను
కులనొడికము లగుసరులుం, దిప్ప బిడారుం ద్రిప్పని తేరుం
దిరముగఁ జదువులు దెలిపెడి తెలెయుం,గప్పగుతూపుల్
గొప్పగురూపుం గడలిని దరువఁగఁ గలిగిన పువ్వుం, దప్పక
యిచ్చు న్విప్పుగ మెచ్చుం దనునటు పొడఁగనఁదడ వెవ్వరికిన్.

వ. అని యమ్మున్నీటిరాణిచెన్ను మాటికిం గొనియాడుచుఁ
గొంతద వ్వరిగి యచ్చట. 47

తోదకము. మావులుఁ జిన్నలు మాదిపలంబుల్
క్రోవులుఁ బొన్నలు గోఁగులు నిమ్మల్
మోవులు రోవులు మోదుఁగు లొద్దుల్
శావులు నిప్పలు రాణ దలిర్పన్. 48

సీ. మదిఁ గూర్మ లుప్పొంగ మొదవు బాలెంతల
పురుడోము ముదుసలిపులులకదాపు
బలుదాదులగుచు బెబ్బులబిడ్డలను నిచ్చ
విసువక పెంచు నాఁ బసులపదువు
లెలమి ముంగిసపిల్ల లెండ దాఁకకయుండఁ
బడగ లడ్డముపట్టు పాఁపగములు
నెలికపూపల వీఁపు లెక్కించుకొని సారె
నలరించు జంగుపిల్లులతుటుములుఁ

తే. జేరి సింగపుఁ *బిల్లల చెమటలాఱఁ
జెవుల విసరెడు నేనిక చేడియలును
గ[illegible] లామున నొడ లెఱుంగమిని జూచి
మేఁత లందిచ్చు తెఱనొటిమెకము లడరు. 49

---

* కొదమల - పాఠాంతరము.

సీ. ఆఱఁగట్టిన కావిచీరల కెంజాయ
చిగురుజొంపంబుల చెన్నుఁ బెంప
నోలి నిచ్చలుఁ జేయు వేలిమి పొగలు తు
మ్మెదదిమ్ములకు రంగు లొదవఁ జేయఁ
దులకించు మూఁడవ తొలిపల్కు రవలి కో
వెలకూఁతలకు నొక్కవింత నెఱప
ముంగిళ్ల బాసవా ల్ముద్దియ లిడినము
గ్గులు పువ్వ్వులకు నిండు తెలివి నింపఁ
తే. గలుగుమ్రాఁకులు జన్నంపుఁగంబములును
దడఁబడంగను దగు నొక్కతబిసితోఁటఁ
గాంచి యబ్బురపడి కోర్కిగడలు కొనఁగ
రాచవేలుపుఱేఁడు చేరంగ వచ్చి. 50

సీ. పటికంపుమురువులు పాఁపకొమ్మ లటంచుఁ
జిలువలఱేండ్లు చేతులఁ బెనంగ
జడలలో నిండ గూండ్లిడినపుల్గులమ్రోఁత
చెలఁగుచు నల్లడల్ చెవుడు పఱుప
గమిగూడి నరపగడ్డము వట్టి వ్రేలుచుఁ
జింకిలీకంబులు చేరి యుఱుక
బెట్టుగా మైనిండఁ బెట్టిన చెదలకై
గొఱవంక లెక్కుడు గోళ్లఁ ద్రవ్వఁ
తే. బ్రాఁతచదువులతుదల నేర్పడినమెఱుఁగు
మదిని గనుఁగొంచుఁ దా వెలి మఱచి కడిఁది
దబము గావించు జాబాలిదండ కరిగి
ముందఱికి నేగి సాఁగిలి మ్రొక్కు టయును. 51

వ. అప్పు డాచప్పు డాలించి. 52

తే. అల్లనల్లన కనువిచ్చి యతనిమేని
సోయగంబును బీరంబు చొప్పు మురువుఁ
దడవుగాఁ జూచి మదిని సంతసము గ్రమ్మ
నపుడు జడదారిరాయఁ డిట్లనుచుఁ బలికె. 53

క. అన్నా నీవె రెవ్వరు
నిన్నుం గనుఁగొన్న నహుషునిం జూచిన య
ట్లున్నది యారావేలుపు
గన్న కొమారుఁడవె నీదుకైవడి దోఁచెన్. 54

చ. అనవిని రాచవేల్పు దొర యాయనఁ గన్గొని కూర్మి నెమ్మదిం
బెనఁగొన నయ్య నే నహుషుబిడ్డఁడఁ బేరు యయాతి
వేఁటకో, పున సవరించినం దెరలు బోనులు గైకొన కొక్క
యిట్టె వచ్చినఁ జనుదెంచినాఁడ నది చేపడునో యను వాలి
తోఁడుతన్. 55

వ. అనవుడుఁ జేరువం దగినయెడం బుడమితేనిం గూర్చుండ
నేమించి గారవించి యి ట్లనియె. 56

క. రక్కసులు వేడబంబుల
మిక్కిలి నాముకొని కొట్టుమిట్టాడంగా
నక్కట యొక మెకమునకై
యిక్కానలనొంటిఁ దిరుగు టిది తగ వగునే. 57

క. మును పొకరక్కసి మెకమై
తన ముందటి కేగుదేర దాని వెనుకఁ దాఁ
జనుదెంచి కాదె రాముఁడు
నను వేదుచు మోసపోయి యలజడి పడియెన్. 58

ఉ. నాపుడు నయ్యయాతి మదినాటిన ప్రేముడి ముజ్జగంబులం
బ్రోవఁగఁ గావ బీరమునఁ బొల్పగు రాముఁడు నట్టిబూ
మెచే, నేవగ మోసపోయె నతఁడేమిటఁ దాఁగడతేఱె
నాకు నో, దేవర యానతీవలయుఁ దేటపడ న్విన వేడుక
య్యెడున్. 59

వ. అని యడుగుటయును. 60

జాబాలి రామాయణకథ యయాతికిఁ జెప్పుట

చ. అలరఁ బులస్త్యుముద్దుకొడుకై తగు విశ్రవసుండు రావణుం
బెలు చగు కుంభకర్ణుని విభీషణుఁ గాంచిన వారు మీఱిచే
బలువునఁ నెల్లెడ గ్గెలిచి పైఁడిదొరం దెగి పాఱఁ ద్రోలి ని
చ్చలమునఁ దావిగట్టుకడ సంద్రములోపలిదీవి యేలుచున్.

క. ఎనలేనికడిమి పెంపున
ననిమీఱిన యింద్రజిత్తు నతికాయుని న
క్షునిఁ ద్రిశిరుఁ గాంచె రావణుఁ
డనయంబును జగము లెల్ల నలజడిఁ జెందన్. 62

శా. ఇట్టట్టెందును బోవరాక వగతో నెల్లప్పుడు న్వేలుపుల్
వెట్టిం గొట్టము సేయ మత్తిలి వడి న్విన్నేటితాల్పున్నయా
గట్టుఁ బిట్టుపెకల్చి రావణుఁ డనంగా మీఱె రాకాసి పెం
బట్టంబేలె నతండు తమ్ముగవ యెప్పట్లం దనుం గొల్వఁగన్.

వ. ఇట్లెందును నెదురులేక యతండు లెక్కకు మిక్కిలి యగు
రక్కసిమూఁకల వ్రేఁకంబులతో జగంబులు వగలం బొగుల
నెట్టికొని కుతిలపెట్టుచు నొక్కనాఁడు. 64

క. అలవోకయుఁ బలె జేజే
నెలవుపయిఁ దాడి వెట్టునిగఁ దనబంట్లం

బిలిపించి సొంపు పెంపున
జెలఁగుచుఁ బయనంపుఁదమకు జేయించుటయున్. 65
శా. కాలెం జుక్కలు గుబ్బలు ల్వాగిలె సంద్రంబు ల్గలంగె న్వడి
న్నేలం గుమ్మరిసారిపోల్కిఁ దిరిగెన్ వ్రీలెన్ దెస ల్బీతుచేఁ
దూలె న్వేలుపుటెంకి పాఁపనెలవుం దోడ్తో వెతంబొందె వే
జాలిం జెందిరి బేసికంటిదొరయుం సైరింప గావెన్నుఁడున్.
వ. ఇట్లు తమకు సేయించి కడిమిరక్కసుల పెక్కువల బెడిదం
పు నడకం బుడమి గ్రక్కదలఁ గదలి చని వెండికొండకెలం
కుల మొనలు విడియించె నప్పుడు. 67

సూర్యాస్తమయవర్ణనము

తే. సరగ మిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగాఁ గాల్చి బంగారుచుట్టువాలు
పదను వెట్టఁగఁ గొనిపోయి. పట్టలేక
విడిచె ననఁ బ్రొద్దు పడమటికడలి మునిఁగె. 68
క. కడకడలి వేఁడివెలుఁ గను
జడదారి వడి స్మునుంగఁ జని జేగుఱుప
చ్చడ మాఱడఁగట్టెఁ దరి ననఁ
బడమట నెఱసంజ నిండె బలుపుగ మఱియున్. 69
సీ. పూనికఁ దగునీటి తేనిపసిండియు
ప్పరిగె వాకిటి తోఁపు తెర యనంగఁ
గ్రుంకు మెట్టున వేల్పుఁ గొమ్మ లాడుచుఁ జల్లఁ
దులకించు చెంద్రపు దు మ్మనంగఁ
గడుసొంపుచే నొప్పు పడమటిమలమీఁది
చెఱులందుఁ గెంపులచాయ లనఁగఁ

దమినాడు తెఱగంటికొమరులు గావింపఁ
బోలుఁ బొందు పగడంపుఁబలుక యనఁగఁ
తే. బ్రొద్దువాసినవంత లోఁ బొడముచుండ
ముఱుఁగు కెందమ్మిరేకులమూఁక యనఁగ
విరియుచెందొవనలకు వన్నె పెట్టి
నిండె నెఱసంజ కన్నులపండు వగుచు. 70
వ. అప్పుడు. 71
సీ. నింగిపేరింటి మున్నీటిలో నప్పుడ
పొడమిన బెడిదంపుబుగ్గ లనఁగ
నాకసం బను మ్రానియందు నొక్కుమ్మడిఁ
బూచిన తెలిచాయపువ్వు లనఁగ
మిన్ననుకొలనిలో మెఱుఁగెక్కి విరియుచుఁ
జిగినుల్లసిల్లెడు తొగ లనంగఁ
జడ లను నల్లపచ్చడముపైఁ బచరింపఁ
దిలకించు నాణిముత్తెము లనంగఁ
తే. గదిసి వలరాచమేపుడుఁగంటివేల్పు
జడలలోనుండి వడియుచుఁ గడితపడిన
తేటవేలుపుటేటిపెన్నీటిబొట్టు
లనఁగఁ జుక్కలు గనుఁగట్టె నలరుఁ దెలివి. 72
చ. తలఁపననుంగులైన యలతమ్ములలోపల డాఁగెఁగాక తా
వెలి కెట కేగఁగాఁ గలఁడు వేఁడివెలుం గని పేర్చి యార్పు
చుక్, సిలుఁగులఁ బెట్టఁగా వెదకు చీఁకటి పోఁకుడు పిల్ల
లో యనం, గొలఁకులఁ ద్రిమ్మరం దొడఁగెఁ గూర్కుక
మ్రోయుచు గండుఁదుమ్మెదల్. 73

క. తమ్ములు మొగిడించినఁ దమ
కొమ్మలలోఁ జిక్క నిక్క కూరిమిఁ జుట్టుం
ద్రిమ్మరు మగతుమ్మెద లా
నెమ్మది వగ గాకయున్నె నెలఁతలఁ బాయన్. 74
క. ఇరులు బలియుచును వలకుల్
కరమరుదై కరుడుకట్టి కదిసినకరణిం
బరఁగఁగఁ దోఁచుడుఁ గాటుక
కరవటముంబోలె నిజ్జగంబు దనర్చెన్. 75
తే. పూని పదిరెండుప్రొద్దులుఁ బొడిచెనేని
యిందులోఁ గానవచ్చునె యించుకైన
ననఁగఁ గలిగిన వన్నియ లలమి తనదు
రూపుగా మాఱె చీఁకటి యేపు చూపె. 76
తే. తనకుఁ బగయగు ప్రొద్దున వెనకి కనక
కనలు చీఁకటిరక్కసికన్నులందుఁ
దొరుఁగు కణకణమను నిప్పుతునుక లనఁగఁ
బొలిచె నెడనెడ మిణుఁగుఱుఁబుర్వు లంత. 77
క. వెలిచాయ దోఁచెఁ దూరుపు
వలనం బగఁ దమ్మివిరులు వాతులమూయన్
నెలచూలన వెలవెల నగు
తొలుకడ యను నెలఁత మొగము తోరపుజిగిగాన్. 78
క. కర మలరెఁ దూర్పుమలఁ జం
దురుఁ డాదట నిర్లసోఁకుఁ దునుముటకై వే
గిర మాకసంపుఁగఱిదే
వర పంపిన కెంపుఁజుట్టువాలుం బోలెన్. 79

తే. వీణె యక్కున హత్తించి విన్ను నాఁగ
వఱలు వెన్నుని గొలువంగ వచ్చు చివ్వ
కూటితబిసియు బలెఁ గందు గొనబు మీఱఁ
జందురుం డల్లనల్లనఁ జదలఁ బ్రాఁకె. 80

క. ఆతఱి వెన్నెలదగు మ
జ్జా! తా జాబిల్లి వెజ్జు జనమున కెల్లన్
రాతిరి సోఁకిన చీకటి
బూతము విడువంగఁ జల్లు*బూతియుఁ బోలెన్. 81

సీ. †వేల్పురాయఁడు దన వెలిమావుఁ దెలిగారు
నీగిమాఁకులఁగాన కెదఁ గలంగఁ
గఱిమేనిదొర పాలకడలిఁ జిల్వాలఱేనిఁ
దెలిదీవిఁ గనలేక తిరుగుచుండ
ముక్కంటి వలిగట్టు నిక్కమెట్టును నాల
పోతుఁ గానక చాల బీతుకుడవ
నలుమొగంబుల మేటి పలుకుఁదొయ్యలి నంచ
వెలిమేనికొడుకును వెదకఁబోవ

తే. నన్ని రంగులు తనరంగు లై తలిర్ప
నిగిడి తెలిచాయ వెల్లియై నిండె ననఁగ
నిక్కి జగముల నెల్లను బిక్కటిల్లి
నిలిచి పొంగుచుఁ బండు వెన్నెల దనర్చె. 82

వ. అప్పుడు. 83

---

* బూతి యనంగన్—పా.

† ఈపద్యములో "మహారాజ శ్రీమాన్ జగతి యశసా తే ధవళితే" అను శ్లోకము నభిప్రాయము నిమిడ్చెను.

సీ. అనుకువెన్నెలఁ దాల్చి తునిచి సేవెలుచేసి
వెన్నెలపాలను జున్నొనర్చి
గట్టివెన్నెల పిండిగొట్టి వెన్నెలవెన్న
గఁ.య వెన్నప్పాలుగా నమర్చి
గడితంపువెన్నెల గండ్రికల్ సిగరిగాఁ
దియ్యవెన్నెలలోనఁ దెచ్చిపెట్టి
యొడల వెన్నెల చక్కెరిడి జోర్కు వెన్నెలఁ
బూనికనాళీలుగాను గూర్చి
తే. పండువెన్నెల యను వెండిపళ్లెరములఁ
జెలఁగి యిల్లాండ్రు వడ్డింపఁ జెలులుఁ దాము
వేడుకలు మీఱ బువ్వంపుఁగూడుఁ గుడిచి
పొదలు తమితోడ వెన్నెలపులుఁగు లమరె. 84

వ. అప్పుడు. 85

క. బలు నెనరైనవి గూర్పఁగఁ
బొలి వోవని లేఁతపాయపుం బొగరులతోఁ
దలిమము లెక్కిడి వెన్నెల
పులుఁగులఁ గని తనదుమదిని బొదలు విరాళిన్. 86

వ. వలరాజు పూఁదూపుల కులికి వేలంబు వెలికిం జని రావణుండు ద్రిమ్మరునట్టియెడ. 87

రావణుఁడు రంభను గాంచుట

సీ. కస్తూరి మొదలుగాఁ గలపంబు చేసిన
గందంబు నునుపూఁతగాఁగఁ బూని
వెన్నెలపొరవంటి వెలిపట్టు వలిపంబు
జిలుఁగుఁబావడ మీఁద నలవరించి

వేలుడుగాఁ దీర్చి కీలుగంటునఁ గ్రొత్త
చనుపకంబుల సరుల్ పెనఁచిచుట్టి
పసిమి సుప్పాంగు పట్టసపుసొమ్ములతోడ
నాణిము త్తెపుఁ బేరు లనువుపఱచి
తే. యందియల ప్రోఁత చెవులకు విందుసేయఁ
జదల నెకసక్కెమాడెడు సన్నగౌను
బిగువుఁజన్నుల వ్రేఁగున బెగడు గుడువ
మరుఁడు దోడుగఁ జనుదెంచు మగువఁ గాంచి. 88
తే. వడివడిం జని యాతఁడో వాలుగంటి
నీదుపే రేమి యెవ్వఁడు నీదుమగఁడు
పూని కాందారిమాంవారి ప్రొద్దుకడను
నెందుఁ బోయెదు తలితండ్రు లెవ్వ రనిన. 89
ఉ. రక్కసిగాయ! యే వినుమ రంభను మిక్కిలి నన్వుకత్తైనై
జక్కులతేనిపట్టికిని జవ్వన మంతయు జన్నె గట్టి రే
యొక్కతె నుండలేక తని యొద్దికిఁ బోవుచునున్న దాన నే
నక్కడలిం దగం గలుగు టందఱు విన్నదె చెప్ప నేఁటికిన్.
క. తడవయ్యె నాకుఁ బోవలె
విడవయ్య తలంపు లోరుల వెలయాండ్రపయిం
బడిపట్టఁ దగవుగా దిది
సడిసేగియు వచ్చు వేల్పుసామికి నైనన్. 91
తే. అనుఁడు రక్కసిరాయఁడో యతివ జగము
లన్నియును బంపు సేయంగ నున్న నన్ను
రాఁణునిగా నెఱుంగవో నీవు తమిని
నెఱఁగితేనియుఁ బలుకుదే యిత్తెఱఁగున. 92

క. సిరి రా మోఁకా లొడ్డిన
కరణిం బైకొనుచు నేన కదియఁగ నను నీ
వెరవుగ విడనాడుచు నొక
తిరిపెపుఁజెలిపట్టెఁ జేరఁ దివిరెద వేమీ. 93

వ. అని పలికి తలంపు నిలుపనోపక పయింబడం దమకించు నతని
తలంపెఱింగి రక్కసున కది యి ట్లనియె. 94

ఉ. కోడిగ మేటికయ్య నలకూబరుఁ డంటినదానఁ గాన నేఁ
గోడల నీకు నావుడునుగొంచక యాతఁడు కూర్మి హెచ్చఁగాఁ
జేడియ యేటిమాటలివి చెల్లునటే వెలయాలి కిచ్చటం
బాడియువావియుంగల దెపల్కకుమట్లనుగాక వెండియుఁ. 95

క. వెలయాలుఁ జెఱువుఁ దెరువుం
జలిపందిరి యొకరిసొమ్మె సమకూర్చి మదిం
దలపోసి చూచి తెలిసినఁ
దలిరాకుంబోఁడి యింకఁ దరితీపేలా. 96

వ. అని పలికి. 97

తే. బలిమిఁ బైఁబడి వలరాచపని యొనర్చి
విడిచి రక్కసిదొర వోయె వేలమునకుఁ
దమ్మికంటియు నాతఁడు తగవుదొఱఁగి
తన్నుఁ జేసినచేఁతకుఁ దలఁకుమదిని. 98

సీ. బలిమితో బిగ్గరఁ బదినొళ్ల నానఁగా
సొంపఱు జిగిమోవికెంపుతోడఁ
సెలగచేతుల గోళ్లఁ జీర నెత్తుటఁ దోఁగి
నజ్జునజ్జయినచన్మొలలతోడఁ

గదిసి మై కందంగఁ గౌఁగిట బిగియింపఁ
జొక్కి ళ్లువోయిన సొమ్ముతోడ
మొనసిన తమిఁ బోఁకముడి దివ్వఁ బెనఁగఁగాఁ
జినిఁగిన సుంజల్వ చేలతోడ
తే. నోపి కెలుఁగక తనలావు చూపి కలయ
బడలి యదవద యైయున్న యొడలితోడఁ
గాఁక నీడ్చిన విడిన కీల్గంటుతోడ
వచ్చె నలకూబరుం డున్న వలని కతివ. !9
క. వచ్చి తనయడుగులం బడి
యచ్చరపూఁబోఁడి వానికంతయుఁ జెప్పన్
హెచ్చుగుచుఁ గినుక మదిలోఁ
బిచ్చిల నప్పసిఁడితేనిబిడ్డఁడు గడిమిన్. 100
క. ఇది మొదలుగాఁగ బలిమిన్
ముదితలఁ దాఁబట్టెనేని ముదితలలువడిన్
బది వగిలి పొలియుఁ గా కని
యదరుచు రావణునిఁగూర్చి యలుకం బలికెన్. 101
వ. అంత. 102
చ. పొదలెడునట్టి చుక్కలనుపువ్వులు చాల విదుర్వ నొప్పున
చ్చుదలను సజ్జ రే యనెడుచానయుఁ డాఁ చెలిరంగుగంద
మొప్పిదముగఁ జిట్లఁగాఁ బెనఁగె చెట్టగు నాయలఁతం గలం
గుచున్, నిదురకుఁ బోలెఁ గ్రుంకుమలనెత్తము చేరెను
జందురుం డొగిన్. 103
క. తెగి యపుడ నిగిడి మగుడం
జిగిరించిన పగటిపేరిచెట్టును బోలెం

దగదగ మనియెడు కెంపనఁ
దగి సంజ దనర్చె మిగులఁ దార్కొనుతెలిపెన్. 104

సీ. అరయ వెన్నుఁడె దేవ రని వేల్పుగమి చాటఁ
గా నెత్తుపైఁడిజేగంట యనఁగఁ
దొలుకడ కడలిలోఁ దిలకించు సిరిగేస్తు
నక్కునఁ దగు నీటియిక్క యనఁగఁ
జేజేలరాయనితేజీతలాటమై
పరఁగెడుపికిలిపూబంతి యనఁగఁ
దూరుపునాఁడేలుదొరపట్టి నీటుతోఁ
గేలఁబూనిన కెంపుగేడె యనఁగ
తే. నిట్టపుట్టగు గక్రేనినెట్టమునను
సొంపుచేనొప్పు తామరకెంపనంగ
మొదలిమువ్వీరతేజుపెన్నుద్దయైన
ప్రొద్దుకెంజాయ నెంతయుఁ బొడమి యొప్పె. 105

వ. అట్టియెడ రావణుండు. 106
సీ. చని యుంగలము వేఁడి చల్లార్చి యల్కతో
జమునిబీరంబెల్లఁ జక్కఁబెట్టి
కొలముపాఁగెమున నప్పొలసుదిండిని నిల్పి
తెగి నీటితేనిపెం పిగురఁజేసి
గాడుపు నెందేని కదలిపోఁ దూలించి
యలక నేలెడువాని కలిమినాఁచి
తివిరి జాబిలితాల్పుఁ దిరిపంబు గావించి
వేల్పు రాయనిసొంపు ప్రీల గెల్చి

తే. బలువుచే వారి నెలవులు పాడుచేసి
చెలఁగి జేజేలకొమ్మలఁ జెఱలువట్టి
కలన నెదిరింప నెవ్వరిఁ గాన కపుడు
కదలెఁ దనదీవి కలరి రక్కసులఱేఁడు. 107

క. ఈకరణిం బదిమొగముల
రాకాసి యొనర్చినట్టి రాయిడిచేతం
జీకాకగుచును వేలుపు
లాకటిదేవరకు నుడువ నరుగుచు నెదుటన్. 108

సీ. కరువలి నెగయు తుంపరుల ముమ్మర మెల్లఁ
గ్రమ్మెడు పుప్పొళ్ల దుమ్ముగాఁగ
గరము పై గదలెడు తరగల మొత్తముల్
సమకొన్న కొమ్మలగములు గాఁగఁ
దనలోన నెలమిని దరిఁజేరి యున్నము
త్యాలెల్లఁ దెలిచాయపూలు గాఁగ
గొప్పలై వెన్నెలకుప్పలో యననొప్పు
బలితంపునురుఁగులు పండ్లుగాఁగ
తే. జాలుకొను తెల్లరంగునఁ జాగమునను
జెలువుమీఱుచు వేలుపుఁజెట్టు వోలెఁ
బరఁగి యెంతయు నుప్పొంగు పాలకడలిఁ
జేరి పలుమాఱు మది సంతసిలుచునుండు. 109

సీ. జగములు గలిగింపఁజాలు నల్వకుఁ బుట్ట
నిమ్మైన పొక్కిలితమ్మివానిఁ
దొలుకారు మొగులుపై నలరుమించిన మేనఁ
గడునొప్పు పసిఁడిపచ్చడమువానిఁ

గలిమి దేవేరి నక్కలికితోఁ బుట్టిన
కెంపు నక్కునఁ దాల్చుసొంపువానిఁ
గొలువవచ్చిన ప్రొద్దు నెలయు నాఁ జేదోయిఁ
జుట్టల్గుఁ జిందంబు సొగయువాని
తే. నాలిఁ గన్నయ్యఁ దనయంకకోలముల్కఁ
గట్టకడనొంచి మించినకడిమివానిఁ
బ్రాఁతచదువులతుదల నేర్పడుచు నొప్పు
నడక గలవానిఁ దమబారి నడఁచువాని. 110
చ. చిలువలతేనిమై యనెడుసెజ్జను మించినమంచుగొండ పై
నలిఁ బొలుపొందు కార్మొగులు నాఁ దగు చామనమేని
నిద్దపుం, జెలువున మీఱు కుందనపుఁజేల మెఱుంగున
నొప్పువెన్నునిం, గలుములచాన గేస్తుఁ గని కన్నులనీ రొలు
కంగ మ్రొక్కుచున్. 111
వ. పలు దెఱంగులం బొగడి వగలు మిగుల నొగిలి పొగులుచు
నెలుంగు రాలుపడ వేలుపు లి ట్లనిరి. 112
ఉ. కంటికి ఱెప్పచందమునఁ గైకొని దేవర ప్రోవ నిన్నినా
ళ్లుంటిమి గాక మీఁదుమది నొప్పరికించిన నొక్కపూఁట
యుర్కు, వుంటిమె యొండుచోటు మఱిమాకును గల్గునొ
చూచి మాసిరుల్, గెంటక యుండఁ గావు మదిఁ గీల్కొ
నుప్రేముడి మమ్ము నందఱున్. 113
సీ. తునిసి కూఁకటి వేళ్లకును బెల్లగిల్లఁగాఁ
బుడుకుమ్రాఁకులు నేలఁ బడఁగఁ ద్రోచి
వాడవాడలఁ గెంపుమేడ లెల్లను జాల
మొదలిమట్లు గలంగఁ జదియఁ దాఁచి

యంగళ్ల తావు లెఱుంగ రాకుండంగ
బంగారుగోడల రంగుజేసేచి
నెలతాలఁ దీరిన యిలమూళిగలలోని
మేలిమచ్చులు ప్రీలఁ గూల నూకి
తే. యంతఁ బోవక సోఁకుమూవంతు లేచి
కొలువజేజేల రాయనికొలువుమేడ
వైజయంతంబు పుడమిపై వ్రాల ద్రొబ్బె
నుగ్గునుగ్గుగ నతనియేనుఁగులు తేసి. 114
సీ. ఉలుప చాల దటంచు నలుగు వేలుపుతేని
నంటగా దని యగ్గి నంటఁ గట్టుఁ
బొలసుదేఁ డని వేఁడివెలుఁగుపట్టిని గొట్టుఁ
గనిగొల్వఁ డనుచు రక్కసుని నొంచు
నీళ్లు చల్లఁ డటంచు నీటితేనిఁ గలంచుఁ
గడువీచి తని గాలి గాసిఁబెట్టు
నదలించుఁ గానుకకై పైఁడిరాయనిఁ
గడకొత్తి ముక్కంటిజడలు పెఱుకు
తే. సరగ వరపుడుఁబనుల కచ్చరలఁ బనుచు
నేమిచెప్పుదు మయ్య మాయిడుముపాటుఁ
దలఁచుకొన్నను గుండియల్ తల్లడిల్లు
జియ్య యింకనైనఁ బ్రోవలె చిత్తగించి. 115
వ. అని వగచి పలుకు వేలుపులమాట లాలించి వారికి వెన్నుం
డి ట్లనియె. 116
చ. వెఱవకుఁడయ్య రక్కసుఁడు వేమఱుఁ బెట్టినబాము లెల్లనే
నెఱుఁగనె వానికి న్నలువ యిచ్చినమాట దలంచి దానికై

దఱి యగునంతకున్ మదిని దాళితి నిప్పని వేగఁదీర్తు నే
మఱిఁ జనుఁడన్న వారు వగ మానుచువచ్చిరి యొకపట్లకున్.

తే. అంతఁ బ్రొద్దుకాలంబున నలరుమేటి
దశరథుఁడు పెండ్లియయ్యెను దగినసొంపు
మెఱయఁ గౌసల్య కైక సుమిత్ర యనఁగ
వెలసి యొప్పెడు ముఁవ్వురుతలిరుఁబోండ్ల. 118

వ. అందు. 119

తే. తమ్మిపొక్కిటివేలుపు దశరథునకు
నలరుకౌసల్యకును రాముఁ డనఁగఁ బుట్టెఁ
గైక భరతు సుమిత్ర లక్ష్మణునిఁ జాలఁ
గడిమిమించిన శత్రుఘ్నుఁ గాంచి రలరి. 120

తే. ఎలమి నప్పాపుఁబోండ్లకు నిట్లు గలిగి
రాముఁ డన లక్ష్మణుం డన రహిని భరతుఁ
డనఁగ శత్రుఘ్నుఁ డనఁగ నెయ్యమున మెఱసి
యిద్ద ఱిద్దఱు కవగూడి యొనసి రెపుడు 121

వ. ఇట్లు గూడి కందుపాం దెఱుంగని విదియచందురునియుందం
బున నానాఁటికి నీటుగలిగి పెరుఁగుచు. 122

క. నెలపూఁదాలుపుపగిదిన్
విలునేర్పున సాటిలేక వెలయుకొమరులన్
లలిఁ జూచి పొంగుదశరథు
కొలువున కరుదెంచె గాధికొడుకు కడంకన్. 123

చ. వెరవున లావునన్ గడిమి బీరమునం బొలుపొందు రాచదే
వర మెఱయంగ నేర్చినకువాళపుమన్నియుమూఁకనేలతా

ల్పరిబలుగాడ్పు తమ్మిచెలిపట్టిని సంద్రము వేల్పుమ్రానిఁ జం
దురు బలిఁ జాగపుఙ్ మొదవునున్న అపించిన యాగినేర్పరీ.

క. కలుములకుబేర యనిగెలు
పులవేలుపుగాకొమార పుడమిఙ్ మెయితోఁ
మెలఁగువలరాయ పలుకుల
చిలువలరాయా దురంపుసెకకన్నేటీ! 125

మాలిని. కలుములచెలి చాలంగ్రైపుతోఁ బాలవెల్లిం
గలిగి చెలఁగుచుం జాగంబుతోఁ మించు లేవఙ్
వెలయఁ గొలములోనఙ్ బీరమ్మఙ్ లావుమీఱం
గలిగి పొలుచుమైతోఁ గమ్మవిల్వాను మేటీ! 126

గద్యము. ఇది శ్రీమదనగోపాలమంత్ర ప్రసాదలబ్ధసారస్వత సుకవి
జనవర్ణనీయవచోవిభవ భావనామాత్యతనూభవ పొన్నికంటి
వంశ్య తెలగనార్య ప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ
తెనుఁగు కబ్బంబునందు ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము

క. సిరిగుబ్బచన్నుఁగొండల
దరులం గఱిమొగులుపగిదిఁ దవిలితిరుగు న
మ్మరుతండ్రి మనువునసముల
నెరయునమీఙ్ఖాన సింగిణీసుల్తానా. 1

వ. అటమీఁది తెఱంగు వినుండు. 2

తే. ఇట్లు వచ్చినజడదారి కెదురుగాఁగ
నరిగి సాఁగిలిమ్రొక్కి తా నతఁ డొసంగు
నట్టిదీవనఁ గైకొని యలరి తబిసి
నపుడు బంగరుగద్దియయందు నునిచి. 3

క. అడుగుందమ్ములు గూరిమిఁ
గడిగి తగం గారవించి కర మలరుచు న
ప్పుడు వచ్చినపని యే మని
యడిగిన రాతబిసిఁ జూచి యాయనతోడన్. 4

క. వెన్నునిమాఱటరూపై
యెన్నఁగఁ దగినట్టిరాము నీకుఁ బాయమునం
బిన్నని చూడక మఱి నాఁ
జన్నముఁ గావంగఁ బనుపఁజను నని పలుకన్. 5

వ. ప్రేముడిం గొడుకు ననుపంజాలకుండియు నతనిపరుసఁదనం
బునకు వెఱచి యనిచిన ననుచుసంతసంబున నెంతయు
రాముఁ డనుఁగుఁదమ్మునితోడ రాజడదారిపజ్జం జనున
ప్పుడు. 6

చ. పెలుచగురూపుతోఁ బునుకపేరులు దూల వెడందనాలుకన్
సెలవులు నాకికొంచు నిరుసేతులఁ గేడెము వాలుఁ బూని
మై, పొలుసుగవు లక్కడుం గదురఁ బొట్టకుఁ గల్గె నటంచు
నార్చుచున్, సొలవక వచ్చుతాటకిఁ గనుంగొని రాజడ
దారి రాముతోన్. 7

క. అదె తాటకి యనురక్కసి
గదగొని యేతెంచె దీనిఁ గూల్పుము కడుబె

ట్టిద మగుతూపుల నిది యా
డది యని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్. 8

క. అని పల్కిన రాముఁడు గ్ర
క్కున లక్ష్మణుచేతివిల్లు గొని యెక్కిడి తూ
పున దానిఁ బుడమిఁ గూల్చెం
దనతమ్మునితోడ రాచతబిసిచెలంగన్. 9

వ. ఇట్లు తాటకిం గూల్చిన. 10

మ. మదిలోఁ గిన్కను బండ్లుగీఁటుకొనుచున్ మారీచుఁ డేతేర
బ, ల్లిదపుందూపున సంద్రమవ్వలికి నోలి న్వానిఁ బోనేసి వే
కదియన్వచ్చు సుబాహునిం దునిమి వేడ్కన్ జన్నముం
గాచి యా, పిదపన్ రాజడదారివెంట జనకుం బేర్కొంచు
రా నర్మిలిన్. 11

క. తనరుచు మిథిలకుఁ జని పెం
పున విల్లెక్కించుపందెమున గెలిచి జగం
బున మించు చాలుపేరిటి
ననఁబోఁడిం బెండ్లియై తనర్చె న్మిగులన్. 12

ఆ. ఇట్లు చాలుపేరియొలనాగఁ బెండ్లి యై
గాధిపట్టి ననిచి కదలి చనుచుఁ
దెగి యెదుర్చురాచపగ నేలవేలుపు
బీరమెల్లఁ జక్కఁబెట్టి యంత. 13

సీ. తగఁ బ్రోలికేగిన దశరథుఁ డర్మిలి
రాముఁ బట్టముగట్టురహిఁ యొఱెంగి
కైక మానుపఁ దండ్రి కట్టడచేసినఁ
దోన తమ్ముఁడు నాలుఁ దోడురాఁగఁ

దనవీడు వెడలి కొందలముతో వెనువెంటఁ
జనుదెంచువారల ననిచి పిదపఁ
దొడవు లొల్లక మేటిజడదారిచందము
ల్నవరించుకొని గంగయవలి కరిగి
తే. గుహుని మన్నించి యమ్మేటికోర్కు లొసఁగి
నిలుపుచును జిత్రకూటపుమలకు నేగి
కాంచి తబుసులు తమ్మును గారవింపఁ
నచట నొక కొన్నినాళ్లుండె నంత నచట. 14

మ. కొడుకుం బాసినవంతఁ దండ్రి తెగినం గోర్కి న్వసిష్ఠుండు
వెన్వడి రాఁగాఁ జని చిత్రకూటమున నన్నం గాంచి రమ్మం
చు వేఁయడుగుందమ్ములమీఁద వ్రాలుభరతుం గౌఁగిలింగడు
న్రాముఁ డప్పు డొడంబాటుగఁ జెప్పి వీటి కతనిం
బుత్తెంచి యాపిమ్మటన్. 15
క. దండక మను కానకుఁ జని
యుండఁగ రావణునిచెలియ లొగిఁ గలయికకై
దండకు రా లక్ష్మణుఁ డది
మిండాడఁగ ముక్కు సెవుల మనుకువ మాన్చెన్. 16

ఉ. గాసిలుదానిసూఁడునకుఁగాఁ ద్రిశిరుండు ఖరుండుదూషణుం
డీసున రాఁగ వారి నని నేపఱఁ ద్రుంచిన రావణుండు దా
తెసి యనుంగురక్కసులతేనిఁ బసిండిమెకంబురూపుగాఁ
జేసి యలంపఁ బంపుటయు సీత కనుంగొని దానిఁ దెమ్మనన్. 17
మ. తమ్ముని నాలిఁ గావ నిడి దానిబడిం జని వేడబంబు చె
ల్దిమ్ములఁగానలేక యలయించుచు బోవఁగఁ గిన్కతోడఁదా

నమ్మరివోసి యేయుటయునా మెకమక్కొడు ద్రెళ్లుచుండియో
తమ్ముడ లక్ష్మణా యన నెదం దురపిల్లుచుసీత పంపినన్. 18

తే. ఒరులపని యేమి జేజేల దొరలనైనఁ
బొడముకడిమిని గలసిలోఁ బొలియఁజేయు
నన్నబలిమి యెఱింగియు నలివమాట
కులికి లక్ష్మణుఁ డంతంత నొద్దికేఁగ. 19

క. ఆతనిఁ గనుఁగొని రాముం
డోతమ్ముఁడ నేలచూలి నొక్కతె నిడి యి
ట్లేలెంతు రె యని దూఱుచు
నాలెగిన మెకంబుఁ గొనుచు నరుదేనంతన్. 20

సీ. జడదారి యై వచ్చి తడయక రావణుం
డణివఁ గొంపోయిన నాకుటింటిఁ
గొమ్మఁ గానక కానఁ ద్రిమ్మరి రాముండు
లక్ష్మణుం డడవి నోలముల వెదకి
పనవఁ గా సీతను గొనిపోవు రక్కసుఁ
గని పోరి మడిసిన కడిఁదిపులుఁగు
నకుఁ దగునట్టిచందము దీర్చి యరుగుచుఁ
బంపచేరువ గాలిపట్టిఁ గాంచి

తే. యతఁడు దెలుపంగ సుగ్రీవు నలరఁజేసి
తమ్ముఁ గొలిపించుకొని వానిదాయయైన
వాలిదునుమాడి మఱి తనవాఁడననిన
యంగదుని నిల్పికొన్ని నాళ్లచటనుండి. 21

ఆ. నేలచూలి వెదక గాలిబిడ్డఁడు లోను
గాను గలిగినట్టి కడిఁదికొమ్మ

మెకపుగముల నసుప మించి యందఱిలోన
ననుమఁ డుప్పుకడలి యవలి కరిగె. 22

ఆ. సీతఁ గాంచి యల్లఁ జేరి యారావేలు
పానవాలుగాఁగ ననిపినట్టి
యుంగరం బొసంగి యువిద నెమ్మదిలోని
వగపు కొంత కొంత నొగులఁ జేసి. 23

వ. అట్లు రాముఁ డంపినయానవా లిచ్చి యచ్చెలువం గనిన యుబ్బునం గొబ్బునం బొంగి సింగారపుఁదోఁట లోనుగాఁ దోఁపులు వెకలించి కాపు లున్నరక్కసుల వెక్కసంబుగా నొక్కుమ్మడి నక్షుఁడు మొదలుగాఁ బలువురఁ బొలసుమే పరుల జముని నెలవున కనిచి పెనఁకువఁ బట్టువడ బెట్టువేడుక పడు గాడుపుఁబట్టిమీఁద రాకాసి మొనలు గనలి. 24

క. పట్టికొని కట్టి రావణు
కట్టెదుటను బెట్టి తోఁకఁ గ్రందుగఁ గోకల్
చుట్టించి యింగలంబున
ముట్టించిన ననుమఁ డలిగి మొగ మిగురింపన్. 25

క. ఉలికిపడి యతనివీటం
గలతావుల నెల్లఁ గలయఁగాఁ ద్రిమ్మరి కో
వెలచాయఁ జేసి మిక్కిలి
యలరుచుఁ బలుమాఱుఁ ద్రుళ్లి నాడుచుఁ గినుకన్. 26

వ. ఇట్లు గావించి యక్కరువలిపట్టి క్రమ్మఱ యక్కొమ్మచేతి గుఱుతు గొనివచ్చి ముద్దియసుద్ది యుద్దవిడి నెఱిఁగించినం బొంగి రాముం డతనిం గౌఁగిటం జేర్చి గారవించి యుడుగర లిచ్చి యనిచినపిమ్మట వేఁడివెలుంగునునుంగుఁజూలిం

బిలిపించి కడలి దాఁటి చనవలయుం జాటింపు మనవుడు
నతం డట్లచేసిన మఱునాఁడు. 27

ఉ. కొమ్మమెకంపువెల్లువలు గొల్వఁగ వేగిర మేఁగుదెంచి సం
భ్రమ్ముకడం దగన్విడిసి రావణుతమ్ముఁడు చేరవచ్చినన్, రమ్మ
నివానికి న్మనుపె రక్కసిపట్ట మొసంగి యేటితేఁ, డమ్మెయిఁ
ద్రోవయీమి మది నెగ్గుచుఁడా విలుకేలఁ బూనుచున్. 28

క. కడు నలిగి పుడిసిలించియు
బడలింపఁగ లేని కడవపట్టియె మఱినా
బెడిదపుఁదూ పని నారిం
దొడిగిన బలుచిలుకుఁ జూచి తొలఁకుటుడుగుచున్. 29

క. అప్పుడు చూచిన నే మని
చెప్పుదు నక్కడలి కాకిచిప్పలు నిసుముం
గుప్పలు దెప్పలు తిప్పలు
కప్పలు చిక్కంగ దుమ్ము గ్రమ్ముచు నుండెన్. 30

ఆ. కడలి యప్పు డొడలు గైకొని చనుదెంచి
కడిఁది మానికములు కాను కిచ్చి
తప్పు చేసినాఁడఁ దగఁ బ్రోవు మని రాము
నడుగుఁదమ్ములందుఁ బడి వడకుచు. 31

వ. తొలుమినుకులకడలనుం గానరాని యాతేనిం బలుతెఱం
గులం బొగడి. 32

ఉ. తెన్నున కేను గా దనను దేవర మీయస మిజ్జగంబునం
దెన్నటికిం దిరంబగుచు నెన్నిక కెక్కుచు నిల్చునట్టుగాఁ
దిన్నఁగఁ గట్టఁ గట్టఁ జను దెమ్మనినన్ సిరిగన్నతండ్రిఁ దా
మన్నన చేసి పంపి తనముందఁ గనుంగొని రాముఁ డిట్లనున్.

క. మనవాఁడై సంద్రుఁడు చె
ప్పినమాటలు వింటి రింకఁ బిఱుతివక మల
ల్గొని వచ్చి కట్టఁ గట్టుఁడు
చనవలయుం గడలి దాఁటి సరగున మనకున్. 34

సీ. నెలతాల్పుదేవర యలిగినఁ బనిగాదు
వెండిగుబ్బలి దేక యుండనిండు
నేల గ్రక్కునఁ గ్రుంగ నిల్వరాదెరికిఁ
దెగి యేడుగొండలుఁ దివకరండు
నలి రేయుఁ బగలును నడక గానఁగరాదు
పుట్టుగ్రుంకుడుగట్లు పెట్టినండు
దేవళ్ల కెంకులఁ దివియుట గారాదు
లలిఁ బైఁడిమలఁ దేక నిలిపి రండు
తే. మఱియుఁ గడుపేరు గలిగిన మలల నరసి
యున్నతావులు గదలింప కునిచి రండు
మీఁర లంచును బిలిచి నేమించి పనుప
నరిగి కొమ్మమెకంబులు నట్లచేసి. 35

తే. వెదకి మఱి కల్లు మల లెల్లఁ గదియఁ జేర్చి
కట్టఁ గట్టినఁ గౌసల్యపట్టి మల్లు
వెల్లువల మున్ను నడిపించి వెనుకఁ గదలి
తమ్ముఁడును దాను మున్నీరు దాఁటి యవల. 36

వ. వేలంబు విడియించి మిడిమేలంబుగా నాలంబునకు వెడలు
రక్కసి యొడయని బెడిదంబున కోర్చి యతనిప్రేకంబులైన
మూఁకల నేలం గూల్చి యంత. 37

సీ. అనిలోన మార్కొన్న యతికాయుఁ జంపించి
కడిమి విద్యుజ్జిహ్వుఁ బడఁగవైచి
ఖడ్గరోముని మేను కడికండలుగఁ జేసి
పేర్మి విరూపాక్షుఁ బేరడంచి
యింద్రజిత్తును జమునింటికి నంపించి
కుంభకర్ణుని నేలఁ గూలనేసి
బలగంబుతోఁగూడ బలియు రావణుఁ ద్రుంచి
మఱియు రక్కసుల నందఱను నొంచి
తే. పిల్చి రాకాసిప్రోలు విభీషణునకుఁ
దిరముగా నిచ్చి సెకబాసఁ దేఱినట్టి
చాలు పేరింటి పూఁబోఁడి నోలిఁ గూడి
తానుఁ దమ్ముఁడు దగ నయోధ్యకును వచ్చె. 38

ఆ. ఇట్లు వచ్చి రాముఁ డెల్లుఱేనిని బ్రొద్దు
చూలి గాడ్పుపట్టి వాలిబిడ్డ
మును విభీషణుండు మొదలైనవారలఁ
గోర్కు లొసఁగి యనిపెఁ బేర్కొనంగ. 39

వ. ఇప్పగిది ననిచి రాముండు కడలేని సిరులు దొడరి కడలి కడగాఁగల పుడమిఁ దడవేలె నిది కనువినుకలి నెలవు పుట్టుచే విరివిగాఁ జెప్పంబడ జగంబు లెఱింగిన దగుటం జేసి నీకుం గొంచెంబుగాఁ జెప్పితి నట్లగుట మీవంటివారికి నొంటి నడవి నడతేరం జన దని యజ్జడదారి గారవించి పంచిన నయ్యయాతి మఁగిడి కాఱడవిలోఁ జనుదెంచు నప్పుడు దప్పిగొని నలుగడలుం బరికించి, 40

క. తనదండ ప్రాఁకులుగా లో
మును గట్టినరాలసంది మొలచినచెట్లుం
బెనఁగొని చీకటి గ్రమ్మం
గనఁదగు నొకపాడునూయి గనుఁగొని యందున్. 41

సీ. మాటమాటై యల్గి మఱుఁగుమై డాఁగిన
నీటికాయని కూర్మి నెలఁత యనఁగ
నామనితోడిసయ్యాటకై యచ్చోటి
కరుగుదెంచిన కానసిరి యనంగఁ
జిలువకన్నియలతోఁ జెలిమి గావింపఁగా
వచ్చిన వలరాచలచ్చి యనఁగ
నడవిసోయగమున కబ్బురమంది క
న్గొనఁగఁ జేరిన పాఁపకొమ్మ యనఁగ
ఆ. ననుఁగుఁజెలిని బోలె నలరుఁదీవియ నూఁది
నిగుడుమనములోని నెగులు చేతఁ
జప్పుడేమిరైన సరగ నాలించుచు
నున్నదాని నొక్కయువిదఁ గాంచి. 42

వ. వెఱఁగుపడి వారువంబు డిగ్గి చేరం జనుదెంచిన నయ్యయాతింగని మున్నెఱింగినదిగాన మదిలోనఁ బొంగునడలు నిలుపలేక. 43

### యయాతి నూతంబడినదేవయాని నుద్ధరించుట

క. వలిపెంబు చెఱఁగు మోమున
నెలఁజేరిన మంచుపగిది నెఱయంగాఁ గో
వెల క్రోల్చుచందమున నా
యెలనాఁగ కలంగి పెద్దయెలుఁగున నేడ్చెన్. 44

వ. ఇట్లు తెగి వగచు నమ్మగువం గనుంగొని మది గరంగం గది
య వచ్చి. 45

చ. అడలున నెంతయు గలఁగి యగ్గలికం గుడిచేయి సాఁచి మై
వడఁకెడు కొమ్మకేలు చెలువంబుగఁ బట్టి యయాతి నూతిలో
వెడలిచి యప్పుడమ్మగువ వేనలిఁగన్నులు మోముఁ జెక్కులు
న్నెడ చనుదోయి నెన్నడుము మేను పిఱుందును గాంచి
వేడుకన్. 46

క. కర మరుదుగ నప్పొలఁతుక
గరగరికకు వెఱఁగుపడుచుఁ గలికీ నీవె
వ్వరిదాన విందులో నే
కరణిం బడవలసెఁ జెపుము కలతెఱఁ గనుడున్. 47

క. తను వెదకవచ్చి యట ని
ల్చినఘూర్ణిక యనెడుదానిఁ జెలికత్తియఁ గ
న్గొన నది యత్తెఱఁ గెల్లను
మును పెఱుఁగుటఁ జేసి రాచముక్కంటిదొరన్. 48

చ. కనుఁగొని నెమ్మది న్నెగులు గ్రమ్మఁగ రక్కసియొజ్జ యంచుఁ
బే, ర్కొనఁ దగునట్టి శుక్రునకుఁ గూరిమి కూఁతురు దేవ
యాని నాఁ, దనరిన యిన్నెలంత నొకతప్పునకై వృషపర్వు
పట్టి నూఁ,తను బడఁద్రోచి పోయె నని దానితెఱం గది
విన్న వించినన్. 49

తే. అతివ వృషపర్వుఁ డన నెవ్వఁ డతనియనుఁగుఁ
గూఁతుపే రేమి తనుఁ బట్టి నూతఁ ద్రోయు
నంతపని యేమి చేసె నీయలరుఁబోఁడి
యనుడు నవ్వాలుగంటి యయాతిఁ జూచి. 50

## ఘూర్ణిక యయాతికి దేవయానివృత్తాంతము చెప్పుట

క. విను వృషపర్వుఁ డనంగాఁ
దనరుఁ రక్కసుల ఱేఁడు తన కనిలోనం
బెనఁగఁ దగు మూర్తి నెందుం
గని యెఱుఁగక జగము లేలుఁ గడలేనిసిరిన్. 51

తే. అతనికూఁతురు శర్మిష్ఠ యనఁగ నొప్పుఁ
గూర్మిసకియలు వేగురు గొల్వ నెపుడు
నా చెలియఁ గూడి యాకొమ్మ యాడుకొనుచు
నరమరలు లేని చెలుముల ననఁగి పెనఁగి. 52

వ. తిరుగుచు నొక్కనాఁడు. 53

క. రంగగు తొడవులఁ బూఁతల
నంగుగఁ గైసేసి యందు నా డెడుతమిచేఁ
బొంగారెడు వేడుకతో
సింగారపుఁదోఁట కరిగెఁ జెలువలుఁ దానున్. 54

సీ. మెదలు తుమ్మెదదిమ్ము రొదలచే నుప్పొంగి
తులకించు పూఁబొదల్ తూఁటిదూఁటి
పలుమాఱు విరుల తావుల తావు లగుతీవ
యుయ్యేలల్ తగ నెక్కి యూఁగియూఁగి
వలిపపయ్యెదలకొంగులు దొలంగఁగ నిక్కి
కొమ్మ లందుచు నవ ల్గోసికోసి
పైఁడి మెట్టిక లెక్కి పైకేగి చేతగ
ట్లందు దాఁగురుమూఁత లాడియాడి

తే. పరువు లెత్తెడు నంచలఁ బట్టిపట్టి
గట్టి పుప్పొడి మెట్టలు మెట్టిమెట్టి

యలసి చెమటలు వాయ నోలాడఁ దలఁచి
యందఱును గూడి కొంతద వ్వరిగి యచట. 55

సీ. పసిఁడి సోపనములపైఁ గుందికట్లకై
కడునుద్దులైన జక్కవలకవలు
పరువంపుఁదొగలవెంబడిఁ గేరి యుప్పన
పట్టె లాడెడు తేఁటిపట్టికదుపు
తమకంబు లుప్పొంగఁ దరగయుయ్యేల లెక్క
కరమూఁగు రాయంచకన్నియలును
మాటికి నెత్తమ్మిమఱువునఁ బింపిల్లు
గూయు బెగ్గురురాచకొమ్మగములు

తే. మలసి చెలువంపుఁగలువలమాటునందు
మేఁత దలఁపక డాఁగురుమూఁతలాడు
నీటిపులుఁగులతుటుములు నిగిడి మెఱయు
సిరుల నీనెడుసొబగుచేఁ జెలఁగి మఱియు. 56

సీ. నలువగు కలువమొగ్గలు జడల్గా నాఁచు
పొలుపైన కుచ్చులిబొంతగాఁగఁ
గడు నొప్పు సంకులు కామాక్షికవగాఁగఁ
దామరవిరి ముద్దుమోముగాఁగఁ
గైవ్రాలు తొగరేకు కకపాలగాఁగఁ బు
ప్పొడి మైనలందిన బూదిగాఁగ
సిరిమీఱు లేఁదూడు సింగినాదముగాఁగఁ
దలిరు లేఁదీఁగలాతంబు గాఁగ

తే. ముదురు మంకెనపువ్వు కెమ్మోవిగాఁగఁ
దములు చూపఱఁ గొలిపెడు కొమరుఁదనపు

జోగురాలును బోలెను సొబగు మీఱు
కొలను గాంచిరి మదిలోనికోర్కు లలర. 57
వ. ఇట్లు గాంచి దగ్గఱం జనునప్పుడు. 58
క. ఒడికపుఁదనసొబగున కె
క్కుడుచెన్నులు గలుగఁ జూచి కొల నాయన్నుల్
నడకొలఁకు లంచు వారికిఁ
గడువేడుకఁ దమ్మితావి కానుకఁ జేసెన్. 59
వ. చేసిన నచ్చెలువలు వలపుమించినసొంపునం బెంపుగని కలఁక
దొఱంగి సిరిదొలంకుకొలంకుకెలంకునకుం జని నిల్చి. 60

## జలక్రీడావర్ణనము

తే. పలుదెఱంగుల సొబగైన వలువ లూడ్చి
చెందిరపుఁగావిపావడల్ పొందు పఱిచి
చిగురుగరులను దగు మరుచిలుక లనఁగ
నెలఁత లెల్లను గొలనిలోపలికిఁ జనఁగ. 61
తే. తరగచేతులఁ బరువంపువిరులముత్తి
యములు కానుకగాఁ జేసి యపుడు కొలఁకుఁ
జెలియ వారలయడుగులఁ జేర్చెఁ దనదు
నాఁచువేనలిపూఁదావి ననిచి నిగుడ. 62
వ. ఇట్లు కొలను సొచ్చి. 63
సీ. తమమోములకు నుల్కి తగ వడంకెడునట్లు
తళ్లుగొట్టెడునీటితమ్ము లలరఁ
దమచన్నుఁగవలయందముల కోడుటఁ బోలె
జక్కవ లొక్కమైఁ జదల నెగయఁ

దమకొప్పులకు లోఁగి తలఁగిపోయె ననంగఁ
గప్పు విప్పగునాచు కడకుఁ బోవఁ
దమకన్నులకు వీఁగి తలఁకుచందంబునఁ
బెల్లుగాఁ గల్వలు తల్లడిల్లఁ
తే. బూని తమచూపులకు నోడిపోవుకరణిఁ
బలుమొగంబులఁ దుమ్మెదల్ గలఁగి పఱవ
ముందుముందుగఁ జెలరేఁగి మూఁక లగుచు
నీటిలోనికిఁ జనుదెంచి నెలఁత లలరి. 64

తే. చల్లు లాడఁగ నప్పుడు చదలనెగసి
మగుడు తెలినీటితుంపరల్ దగియెఁ జూడ
వారి నీరాటకును మెచ్చి వలపురాయఁ
డాని కురియించుపువ్వులవాన లనఁగ. 65

తే. ఓల లిడి పట్ట నరిగిన నొయ్య నీట
మునిఁగి దవ్వుల లేతురు ముదిత లంతఁ
దెలిమొగులు సొచ్చి వెడలుచుఁ జెలువుమీఱు
మేలితుఱఁగలి గొనియెడుమించు లనఁగ. 66

క. మగువ వడి నీఁదుకొని తా
నొగి దవ్వుగఁ బోవఁ జూచి యొక్కతె కలువం
దగ వైచిన రేకులు మైఁ
దగులుడు నది వేల్పుతేనిఁ దలఁపించెఁ గడున్. 67

క. తమ్ములు నక్కొమ్మలకనుఁ
దమ్ములు గనుఁగొనుచు నన్నదమ్ము లటంచున్
జుమ్మని మ్రోయుచుఁ దుమ్మెద
దిమ్ములు వడి మూఁగ మునిఁగి తేలుదు రతివల్. 68

క. ఎలనాఁగలగుబ్బల మదిఁ
జెలులని జక్కవలు వచ్చుఁ జేరఁగఁ దమకా
బలువున్నదొ యాబటువగు
చెలువున్నదొ దాని కెఱుఁగఁ జెల్లునె యచటన్. 69

తరల. పలు దెఱంగులఁ బోవుచందురుఁ బట్టనన్నిటి కన్నియై
యలిగి వే వెనువెంట నేఁగెడు నట్టి జాబిలిమేపరుల్
బలె జడ ల్గడునీటఁ దేలుచుఁ బైపయిం జనుదేరఁగా
నిలువుటీఁతలవచ్చుకొమ్మలనెమ్మొగమ్ములు పొల్పగున్. 70

క. పొలతులనీడలు దగియెఁ
బలువై యచ్చెలులపొలుపుఁ బడయఁగఁ గోర్కిం
జిలువనెలంతలు నీటం
దల క్రిందయి తబము సేయఁ దగిలి రనంగన్. 71

పంచచామరము.—

దరిం గరంబు నిల్చిపొల్చి దాఁటి నీటిలోఁ బొరిం
బొరి స్మునింగి తేలి తేలి పొల్తుక ల్దలిర్త ర
చ్చర ల్మలంగలంచ మించుసంద్రునందుఁ బుట్టుచుఁ
దురీన లేచునట్టిజాడ దోఁపఁ జూప రెన్నఁగన్. 72

వ. ఇట్లు నీరాట సల్పునట్టియెడ. 73

క. సురకరువలి చను దెంచిన
దరిఁ బెట్టినకోక లెల్లఁ దడఁబడి పోఁగా
నరిగి యవి దెచ్చి చెలు ల
బ్బర మగుతమచీర లెల్లఁ బూనిన నందున్. 74

క. లలి నీనెఱఁతయుఁ దానును
వలువలు వీడ్వడఁగఁ దాల్చి వైళమె చెలువల్

దలఁపింప నెఱేఁగి కినుకం
గులుకుచు రక్కసుల ఱేనికూఁతురు తెగువన్. 75

ఉ. నెట్టన రేయినిం బగలు నేరమి వెట్టు నటంచు వేలుపు
ల్వెట్టియఁ గొట్నము ల్చలుప ప్రీలని చేబలువొప్ప సోఁకు
డుం,బట్టము గట్టుకొన్న వృషపర్వునికూఁతుర నట్టినేను నీ
కట్టినమైలఁ గట్టుదునె కావర మేటికి వచ్చె నీ కనన్. 76

వ. విని యయ్యేలనాఁగకు దేవయాని యి ట్లనియె. 77

క. ఉసు ఱొక్కటి యై బొందులు
వెస రెండుగ నుండి వల్వ వీడ్వడుటకుఁ గాఁ
గస రెద విది తగ వగునా
పసిబిడ్డవె వాయి తెఱచి పల్కెదవు చెలీ. 78

క. అనవుడు నుడుగక మిక్కిలి
కినుకం గేరడము లాడ గేలిగఁ గొనుచు
న్వాని విని వేసరి యోర్వక
యెనసినవగతోడఁ గూడ నీపడు చనియెన్. 79

మత్తకోకిల. ఓలి రక్కసివంగడంబునకొజ్జకూరిమికూఁతుర
న్నేలవేలుపుఁగన్నియం దగ నీవుగట్టినపుట్టముం
దాలుపం దగు నమ్మ నా కని దాని కర్మిలిఁ బల్కఁ దా
నాలకింపక నూతఁ ద్రోచి గయాళి యై చనియె న్వడిన్. 80

వ. అని యక్కలికి తెఱం గెఱింగించిన విని కటకటం బడుచు
మగిడి పొగడందగు తేజి నెక్కి మక్కువతో యయాతి తన
ప్రోలికిం జనియె నిట దేవయానియు శర్మిష్ఠ చేసినయొగ్గుఁ
దలంచుచుం జనిచని. 81

క. తనతోడ వచ్చుఘూర్ణిక
యను చెలికత్తియను జూచి యయ్యింతి మదిం
బెనఁగొనువగలం బొగులుచుఁ
గనుఁగొనలం గినుక వొడమఁగాఁ దమకమునన్. 82

తే. చెలువ వృషపర్వువీడు నేఁ జేరనొల్ల
నయ్య కీజాడ నుడువు నీ వనుడు నదియుఁ
జని యెఱింగించుటయు వంత పెనఁగొనంగ
నొంటిఁ గాల్నడ రక్కసిఱేఁజు వచ్చి. 83

సీ. కలువలు ముత్యాలఁ గనియెడునో నాఁగఁ
బొరిఁబొరిఁ గన్నీటిబొట్లు జాఱ
నిరు లాఁకట మెసంగి యెరవేయుచుక్కలో
నాఁ గప్పుగొప్పున ననలు వ్రేల
వలఁబడ్డ జక్కవల్వలె వల్పె పయ్యెద
నిట్టూర్పులను జన్ను మిట్ట లదరఁ
గళుకులై తమ్మిపైఁ గ్రమ్ముమంచును బోలె
మొగమునఁ జెమటతుంపురు లెలర్పఁ

తే. బండి వాడిన యలదొండపంటిపగిది
మొనసి వఱువట్లువట్టి కెమ్మోవి దనరఁ
జెన్ను దఱిగినసొగసుతో విన్ననైన
దేవయానిఁ గనుంగొని తెగచి వగచి. 84

క. మున ఘూర్ణికచే వినుటం
దనకూఁతుం గారవించి తలిరుంబోఁడీ
చను నే వగవఁగ నొక యెడ
ననయము నగు నలువకైన నవుగాము లొగిన్. 85

తే. కొమ్మ శర్మిష్ఠ తా రాచకూఁతు రగుట
నెఱుఁగ కీలాగు నిచ్చోట నెగ్గొనర్చి
తప్పుచేసిన నది నీకుఁ దడవఁదగునె
కొండికయుఁ గాదె నదియు నట్లుండె వినుము. 86

ఉ. చెన్నగుమానికంబులును జెల్వగుగుజ్జము లేనుఁగు ల్పదా
ర్వన్నె పసిండి కోర్కెగడువంగను బాలుల కిచ్చియెన్ని యేఁ
జన్నము లెన్నఁ జేయుచు నసంబున మీఱెడువారుసాటియే
కన్నియ యల్క లేక యొడికంబుగనుండెడి ప్రోడ కెయ్యెడన్.

క. తట్టినఁ గొట్టినఁ బన్నము
ముట్టిన నలుకయును వగపు మును దొలఁగుచు నె
ప్పట్టున నలరిన మరలం
బుట్టువు వారలకు లేదు పువ్వుంబోఁడీ. 88

వ. కావున నలుక నలఁకువకు నిలుకడ యగుట దాని విడువ
వలయుఁ దెలియు మదియునుంగాక ప్రోచువారియెడ నొక్క
కొదవ గలిగిన మది నిడం దగ దిది యేమి రమ్మనవుడు దేవ
యాని యతని కిట్లనియె.

క. నిండుఁదలంపునఁ దగ రా 89
పొం డనుగారవము లేనిపొరపొచ్చెమునం
గొండంతపసిఁడి యిచ్చిన
నుండంగాఁ దగునె వారియొద్దం దండ్రీ.

క. నెలకొనుచుట్టఱికంబును 90
జెలికారము మునుపుఁ దనకుఁ జేసిన మేలుం
దలఁపక యెగ్గులు వలికెడు
ములుచలకడ నుండిరేని మోసము వచ్చున్. 91

వ. కావున నేను వృషపర్వునివీడు వొరనొల్ల ననిన నతండు. 92

క. పట్టీ నినుఁబాసిన నా
కెట్టు మెయి న్నిలుచు నుసులు లేదుగడయు నె
ప్పట్టునను నీవ నీతో
నెట్టనఁ జను దెంతు ననుచు నెగులునఁ బలికెన్. 93

వ. అత్తెఱంగున నుండ వృషపర్వుం డటకు వచ్చి వంతతో
నెంతయు విన్ననై యున్నకన్నియం దొడలపై నిడుకొని
బడలికఁ గడలేక కడలుకొనునడలునం దగులు నొజ్జలం 94
గనుంగొని మ్రొక్కి యిట్లనియె.

సీ. దురములోఁ దెఱగంటిదొర నింగలపువేల్పుఁ
గడిమి గెల్చినది నీకతనఁ గాదె
కలనిలో జముని రక్కసిఱేని నెదిరించి
గాసిఁబెట్టుటయు నీకతనఁ గాదె
యనిలోన నీటిరాయని గాడ్పుఁ దెరలించి
వెతమాలుటెల్ల నీకతనఁ గాదె
కయ్యాన జక్కులగమి కాని ముక్కంటిఁ
గుతిలవెట్టుటయు నీకతనఁ గాదె

తే. తమ్మిచూలియు వెన్నుండుఁ దలఁకి మాకుఁ
గలఁగుచుండుట యెల్ల నీకతనఁ గాదె
కాకయుండినఁ దలఁప రక్కసుల కెల్ల 95
పేరు నిల్చునె జేజేలపేర్మికతన.

క. అని పలికి దేవయానిం
గనుఁగొని రక్కసులఱేఁడు కలఁగకు నీకీ
కిను కేమిటఁ దీఱెడు నది 96
వినిపింపు మొనర్తు నట్ల వేగిర మనుడున్.

వ. దేవయాని యి ట్లనియె. 97

క. అట్టేని నీదుకూరిమి
పట్టిని శర్మిష్ఠ నాకుఁ బనిసేయంగాఁ
గట్టడసేయు మటన్నను
నెట్టన రక్కసులతేఁడు నెమ్మదిలోనన్. 98

క. కర మలరి కూఁతు రసు రెం
పరయక యాతండు దేవయాని కొసఁగె వే
పురువిరిబోఁడుల తోడుత
వరుసను శర్మిష్ఠఁ దెచ్చి వరవుడు గాఁగన్. 99

వ. అప్పుడు వృషపర్వుండు తనకూఁతు నిచ్చుటకు సంతసిల్లు
దేవయానిం జూచి శుక్రున కి ట్లనియె. 100

క. ఏడ స్త్రీకొలమింటం
జూడము ముంగులులు గూడుచుం గొనబున ని
ట్టీడేటి కట్టుదప్పిన
చేడియ నీకనైనఁ బెండ్లి సేయం దగదే. 101

ఆ. అనిన శుక్రుఁ డనియె నాసోఁకుతేనితోఁ
గలదు దీనికొకటి కచుఁడు దొల్లి
పెలుచ నేలవేల్పుఁ బెండ్లిగాకుండెడు
మనుచుఁ గినుకఁ బలికి యతఁడు చనియె. 102

తే. అందుకతమున నీయింతి కెందుఁ దగిన
చెలువు నెవ్వానిఁ గూర్చునో నలువ యనుచు
వంత నున్నాఁడఁగాక యీవాలుఁగంటి
పెండ్లి దూఁగించు టది యెంతపెద్ద మాకు. 103

వ. అనవుడు. 104

క. అయ్యో కచుఁ డన నెవ్వం
డయ్యో యీముద్దరాలి నట్లనఁగఁ గతం
బెయ్యది యనవుడు నత్తొలి
దయ్యంబులయొజ్జ పలికెఁ దగ నాతనితోన్. 105

శుక్రుండు కచునివృత్తాంతము వృషపర్వునకుఁ జెప్పుట

సీ. విను మనరక్కసులును వేలుపులుఁ దొల్లి
కలనిలోఁ బోరాడి పాలియుచుండఁ
దెగినసోఁకుడుమూఁక మగుడ నాబలువిద్దె
పెంపుచే బ్రదికి అంపిల్లుచుండ
జేజేలు పాలిపోయి చేయునట్టిది లేక
కింకతోఁ బొగిలి యా కీ లెఱింగి
యిది నేర్చిరాఁ బ్రోడ యెవ్వాఁడో యని చాలఁ
దలపోసి తమయొజ్జదండ కరిగి
తే. విన్నఁదనములచే సొంపు చెన్ను దఱిగి
యందఱును మ్రొక్కి ముందఱ కరుగుదెంచి
కలక డగ్గుత్తికలచేత నెలుఁగురాలు
పడుచు నుండంగ నిట్లని పలికి రపుడు. 106
తే. రాజు మగఁ డైనవెనుకను గాజుఁగడియ
మన్నసామెత నిక్కంబె యయ్యె మాకు
నీవు గల్గియు నిటువంటి నెగులు గల్గె
నింక మాచంద మే మని యెన్నుకొనఁగ. 107
క. విను రక్కసులును వేల్పులు
ననియెడు నీరెండుదెగల సాశుక్రుఁడు నీ

వునుఁ దగ నడిపెడివా రతఁ
డని నీల్గినపాలసుఁదిండ్ల నందఱ మనుపన్. 108

క. బలిసిరి రక్కసు లనిలోఁ
బొలిసినవా రెల్ల మనఁగఁ బోయిన పోకై
యలసిరి వేల్పులు మగుడం
దలకొను బ్రదు కాసలేమిఁ దలఁపవు దీనిన్. 109

క. అనయము నీతో సరివాఁ
డనిలో రక్కసుల మొనల నన్నిఁటి మనుపం
దనవారిఁ బ్రోవఁ డితఁ డన
వినుచును నీసడికి నెట్లు వెఱవవు తండ్రీ. 110

తే. ఒరునిఁ బ్రోచుట కొఱుకుఁగా నరుగు దెంచి
చెనఁటినైనను వేఁడఁగాఁ జెల్లుఁ బుడమి
వెఱచు జేజేలగమిఁ బ్రోవ వెన్నుఁ డరిగి
రక్కసుని వేఁడె నతనికిఁ దక్కు వేమి. 111

ఉ. దేవరపట్టి నిక్కుచు మదిం బసిబిడ్డఁడు నాళ పేర్మి సం
జీవనిఁ దేరఁ బంపుఁ డది సేకుఱు నీతనిచేతఁ బెంపునుం
జేవయుఁ గల్గు వారలకుఁ జిన్నదనంబు దలంపవచ్చునే
కావున దీని కియ్యకొనఁగాఁదగు మాపయిఁ గల్గుప్రేముడిన్.

చ. అనవుడు నెట్టకేల కతఁ డర్మిలిఁ బంపఁ గచుండు వచ్చి మ
మ్మును బొడగన్న మే మతని ముద్దుదొలంకెడురూపుఁ
జూచి రమ్మని కడు గారవించి మది నారసి కూరిమిఁ జెప్పు
చుండఁగా, నొనరెడు నేర్పుచేఁ జదువుచుండెను చెల్వని
దేవయానితోన్. 113

వ. ఇట్లు చదువుచు. 1

క. చట్టుఁదనంబునఁ గడు మా
పట్టునఁ గనికరముఁ గూర్మి బయలుపడంగా
నెట్టుకొని వేల్పుటొజ్జల
పట్టి కచుం డోరిమతోడఁ బసు లోనరింపన్. 115

ఉ. ఎన్నఁడుఁ గంటలేదు విను మిత్తెఱఁ గెల్లను సోఁకురాయ
యీ, కన్నియ దేవయాని మదిఁ గ్రమ్మెడుప్రేముడి నిచ్చలుం
గచుం, గన్నులఁగానకుండిన వగం దుఱపిల్లి యొడ ల్గ్రాఱం
గుఁ దా,నున్నవి యేమి చెప్ప నిఁక నుగ్మలికిం గలకూర్మి
యెట్టిదో. 116

క. ఇత్తెఱఁగునఁ దొయ్యలికి
న్నెత్తురుపొత్తగుచు నతఁడు నిచ్చలు మదిలో
హత్తినప్రేముడిఁ జదివెడు
నత్తఱి నొకనాఁడు తేపటంతఁ గడంకన్. 117

క. తనకుఁ దగు నేల వేలుపుఁ
బసు లెల్లను దీర్చి వేల్మిపసరముఁ గావ[illegible]
వెనుకొని యడవికి నరిగిన
గినుక న్రక్కసులు వాని గీటడఁచి వెసన్. 118

తే. పట్టి యొకమ్రానితో నంటఁగట్టి వైచి
మరల వచ్చిరి యంతఁ దామరలవిందు
కచునియునికికి నడలుచుఁ గడకుఁ బోవు
కరణిఁ గనుపట్టి పడమటికడలి మునిఁగె. 119

వ. కచుండు రామికి దేవయాని తద్దయు దురపిల్లుచు నిట్లనియె.

ఆ. అకట ప్రొద్దుగ్రుంకె నావులు చనుదెంచెఁ
గచుఁడు రాఁ డిదేమి కతమొ నేఁడు

చిలువగములు రక్కసులుఁ గొట్టుమిట్టాడు
నడవిలోన నేమి యయ్యె నొక్కొ. 121

క. అని వగచు దేవయానిం
గనుఁగొని లోఁజూపుచేతఁ గాంచి కచుం డేఁ
బనిచితి సంజీవని నది
యనువుగ మై నుసులు నించి యతనిం దెచ్చెన్. 122

వ. ఇట్లు పెక్కువరుసలు రక్కసులయుక్కివంబున మక్కిన
బ్రదికింపనుండి వెండియు నొక్కనాఁడు. 123

క. అడవికి వేలిమిపసరము
బడిఁ జన రక్కసు లెఱింగి పట్టుకొని కచుఁ
వడి బూదిచేసి నాకుం
దొడిఁబడఁగాఁ గల్లునీటితో నిచ్చి రొగిన్. 124

ఉత్సాహ.—
గుట్టుతోడ ని ట్లొసంగఁ గ్రోలి యేను నన్నుతో
గుట్టుపాటె యుండునంతఁ గ్రుంకుమెట్టనెత్తపుం
జట్టుమీఁద బ్రొద్దుచేరె సంజతోడ నీటిరా
పట్టపయ్యె కెంపుగోడపట్టు పైఁడిసాననాన్. 125

క. అక్కచుఁడు రామి నప్పుడు
పొక్కుచు నీదేవయాని పొడమువగ నయో
రక్కసులచేత మడిసెనె
యక్కట తనుఁగన్నతల్లి యటమటఁ గుడువన్. 126

ఉ. అక్కరు లా మొగంబుచెలు వాకనుదమ్ములసోయగంబు నా
యక్కను జేతు లానడుము నాపిఱుఁ దాతోడ లాయొ

యారపుం, బిక్కలు మెట్టుఁదమ్ములును బ్రేముడి నామదిఁ

బాయకుండఁగా, నక్కచు నెట్లుగా మఱతు నాఱడిఁ
దయ్యెను! యింత చేసితే. 127

క. మును నలువ యెఱిఁగి మదినా
కినుమునఁ గావింపఁబోలు నిమ్మెయిఁ గాకుం
డిన నింతతడవు కచునిం
గనుఁగొనకుండుటకు నెట్లుగా నిటు లోర్తున్. 128

క. అని వాఁడు రాకయుండినఁ
దనమేను దొఱంగ మదిని దహతహపడు దీ
నిని గాంచి చాల వేసరి
యెనసినవగ డిందుపఱుప నే ని ట్లంటిన్. 129

క. విను వేల్పుటొజ్జకొడు కని
కినుకఁ రక్కసులు వాని గీటఁడచెద రా
తని కింత వగవ నేటికిఁ
జనుఁగా కలపుట్టువేదుచక్కికిఁ గడఁకన్. 130

వ. అనవుడు మిగుల వగల నొగిలి యిమ్మగువ యిట్లనియె. 131

చ.*గొనముల ప్రోక యంగిరసుకూరిమిమన్మఁడు వేల్పుటొజ్జ పే
ర్మినిగనుగొన్న బిడ్డ మఱి మీకును జట్టు కడిందిరూపునే
ర్పునుగడు నేమముంగలుగు ప్రోడవితాతొలు వేల్పుమూఁకచేఁ
జనిన కచుం దలంప మది జాలిఁ గరంగదె యెట్టివారికిన్.

సీ. జగములఁ గలిగింపఁజాలు నల్మొగముల
దొరపట్టియైన యంగిరసుమన్మఁ
డరయ వేల్పులకెల్ల నయగా రనందగు
నుడుగుతేనికిఁ గూర్మికొడుకుఁగుఱ్ఱ

* "మతిలోకోత్తరుఁడైన యంగిరసుమనుండు" అను నన్నయ భారత పద్యము ననుసరించినది.

వేమాఱునోఁచిన నోముల పంటయై
కనుపట్టఁగాఁ దార కన్నబిడ్డ
భృగువుమూఁడవయప్పు తగఁ దీర్పఁ గలిగిన
పెనులిబ్బి వగునీకు ననుఁగుఁజట్టు
తే. నేలవేలుపు మొదలిటి నేమములకు
నెలవు చెలువపుగమికాఁడు పిలుకుమారి
రక్కసులచేతఁ బోయిన యక్కచునకు
వగవ కెట్లోర్తు మై యెల్ల నొగులఁ దండ్రి. 133

ఆ. అతనిఁ జూచికాని యారగింప నటంచు
వగచుచున్న దీని తెగువ యేఱఁగి
చిదిమి కడుపులోన జేవెట్టికలఁచిన
యట్టులైన నోర్వ కడలి యేను. 134

మ. విను లోఁజూపున నేలపై నడవులు న్వీళ్లు న్మలల్ సంద్ర
ముల్, పెనుదీవు ల్గగుపల్లియ ల్వేదకి హాళిం జల్వతేం
డ్లిమ్ములుఁ, వినుద్రోవ ల్గడు వేలుపున్నెలవు లన్నిం జూచి
యేఁ గానలే, కనయంబు న్మదిన బ్రము న్వగపు నా కంతం
తకుం గ్రమ్మఁగన్. 135
ఆ. మఱియు నట్లుచూడ మదిలోనఁ దోఁచినఁ
గంటి బూదియగుచుఁ గల్లుతోడఁ
గలసి నాదునిండుఁగడుపులోనన యున్న
కచుని సంతసంబు గడలుకొనఁగ. 136
క. కలుదోసంబును రాకా
సులు చేసినయట్టికాని చొప్పును మదిలోఁ

దెలిసికొని యలుక వొడమిన
గలఁగుచు ని ట్లంటి నిజగంబుల నిల్పన్. 137

క. తొలుబాముల బలునేమం
బులతోడం బెక్కుజన్నములు సేయంగా
గల తెలివిఁ జెఱచు నెయ్యెడఁ
గలు ద్రావందగునె యెఱుకగలవారలకున్. 138

క. అని కలుద్రావుట యెవ్వరి
కిని గా దని పలికి పంతగించుచు సంజీ
వని చేతఁ గడుపులోఁ గచు
ననువునఁ బ్రదికింపఁ దెలిసి యతఁ డి ట్లనియెన్. 139

ఉ. లావుఁ గడంకయు న్మఱినలంగనిమేనును బొందఁగల్గె నే
దేవరవిద్దచే బ్రదికితిం దగ నీకడు పింక వెళ్ల నే
త్రోవయొ యాన తీవలయుఁ దోఁచినలాగున నన్ను బ్రోవఁగా
నాఁపుడు నోడకుండు మని నామది వీఁ డరుదెంచు టెట్లొకో.

వ. అని పలుదెఱంగులం దలపోసి. 141

క. విను కడుపు వ్రక్కలించుచుఁ
జనుదేరఁగ సోలిపడ్డ సరగనె కడక
న్నను బ్రదికింపఁగ సంజీ
వనిఁ జెప్పితిఁ గచున కపుడు వదలనికూర్మిన్. 142

ఆ. బ్రదుకుఁద్రోవ యిట్లు పరఁగ నేఁ జెప్పినఁ
గచుఁడు వెడలె నిండుఁగడుపు వ్రచ్చి
పుట్టుగట్టుచఱిని బొడముతమ్ములవిందు
కరణి మేనితెల్వి కడలుకొనఁగ. 143

చ. చెలఁగుచు నిట్లు దాఁ గడుపు చించుచు వెల్లిన మేనిలో
నుసుర్దొలఁగుట నేలపైఁ బడినఁ దోడనె నన్బ్రదికించి
నేర్పుతో, వెలసెను వానికిఁ బ్రదుకువిద్దెయు మిక్కిలి
పెంపుతోడ వేల్పులు గొనియాడుచుం గురియు పువ్వుల
వానలు మీఁదఁ బర్వఁగన్. 144

వ. ఇట్లు సంజీవని వడసి కచుండు తాఁ దడవున్నవాఁ డయి
మాతో నొక్కనాఁ డిట్లనియె. 145

క. మీరును మీదేవేరియు
గారవమునఁ బ్రోవఁ దడవుగా నిట నుంటిం
గోరినది గల్గె నంపుఁడు
తారను మాతండ్రిఁ జూడఁ దలఁచితి ననుడున్. 146

ఉ. పిన్నవుగాన నీవు కడు బ్రేముడి ముంగిటిలోనఁ ద్రిమ్మర
న్నిన్నబలెం దలంపఁబడు నీ విట నిల్చిన పెక్కులేండ్లు మా
కన్నులువాఁచు నీమొగము గానక యెప్పుడుఁ జూడకున్న నా
యన్న యిదేటికిం దమక మారసి చూచిన వింతవాఁడవే.

క. నీవనఁగ దేవయానన
గా వేఱే మాకు వింతగాదే కద నీ
కీవేగిర మేటికి మది
నావుడు నతఁ డట్ల కొన్ని నాళ్లుండి వెసన్. 148

వ. తనవీటికిం బోయెద నని విన్నవించుటయు. 149

సీ. కరము పెద్దయిన యంగిరసు చెంతకుఁ బోయి
చక్కఁగాఁ జాగిలి మ్రొక్కె ననుము
జేజేల కొజ్జయై చెలఁగెడుమీతండ్రి
గ్రుచ్చికౌఁగిట జేర్చికొనియె ననుము

తనతోఁడఁబుట్టువుఁ దార నెమ్మదిలోన
నర్మిలి దైవాల నడిగె ననుము
కడు జయంతుఁడు లోనుగాఁ గొమాళ్లను గూడ
వేల్పులన్నిని దీవించె ననుము
తే. మఱియుఁ దక్షిణవారి నామాట గాని
తగినలాగునఁ బలుకు మందఱికుఁ జాల
నలరు నీ వని చెప్పి నే ననుప నతఁడు
నరుగ సమకట్టి యున్నచో నప్డు డెజేఁగి. 150
సీ. ముదురువెన్నెలగాయు ముత్యాలతిన్నెపైఁ
బైఁడియచ్చనగండ్లు పాఱవైచి
మఱియాడియాడి తామర కెంపుఁబీటపై
నోమనగుంటల నుజ్జగించి
పాఁపమేపరిపచ్చపన్నా రులోవులఁ
గులుఁకు గుజ్జనగూళ్లు నడుచు టుడిగి
తనయీడువారైన తలి రాకుఁబోండ్లతో
సిరిబొమ్మపెండ్లిండ్లు సేయ కడలి
తే. తోఁడిచెలు లెల్ల వెఱఁగుతోఁ గూడరాఁగ
గొనబుఁగనుదమ్ములను నీళ్లు గ్రుక్కుకొనుచుఁ
జిన్ని వేనలి జాఱంగఁ జిన్న వోయి
తెగువ నచటికి నేతెంచె దేవయాని. 151
వ. ఇట్లు వచ్చిన నక్కచుం డి ట్లనియె. 152
మత్తకోకిల.—
తోడఁబుట్టుగుకన్న నీ వొగిఁ దోడునీడయి ప్రోవఁగా
నీడ నేకొద లేక యుండితి నింక మాతలిదండ్రులం

జూడఁ బోయెద నయ్య వారలఁ జూచి రమ్మని పంపెనో
చేడియా మదిలోన నాదగు సేమ మారయుచుండుమీ. 153

క. అని పలుకఁ గొమ్మ మిక్కిలి
తనమది గలఁగంగ నిట్టితలఁపులు గలవే
మును నీకు నాకుఁ దగులము
నొనరించెం దమ్మిచూలి యుల్లములందున్. 154

సీ. ముగురువేల్పులు మెచ్చు భృగువున కర్మిలి
మనుమఁ డన్నది నీకుఁ జనువుగాదె
యనయంబుఁ దొలివేల్పుటయగారికినిఁ గూర్మి
యల్లుఁ డన్నది నీకు ననువుగాదె
పొగడు నీలువుచేతఁ దగు దేవయానికిఁ
జెనిమిటి యన నీకుఁ బెంపుగాదె
తుదవృషపర్వుండు మొదలైన రక్కసు
ల్మన్నించు టది నీకు వన్నెగాదె

తే. తొడఁగి యాఁగామి నీమదిఁ దోఁచకున్న
నసుఁగు లగు పెద్దవారల నడిగి చూడు
మేల విడనాడ నాలిగా నేలు నన్నుఁ
వినుము చెప్పెద మాటలు వేయు నేల. 155

క. అనఁ జెవులు మూసికొనుచుం
దనమదిలో నలిగి కచుఁడు దలిరుంబోఁడీ
వినఁ దగనిపలుకు పలుకం
జనునే తలపోయ నిట్లు చాలు సుడుగుమీ. 156

క. విను చదువు చెప్పినతఁడుం
దనతండ్రియు నొక్కరూప తలఁపఁగ నదిగా

వున నీకు నాకుఁ జెల్లెల
ననువగునా యిట్టిమాట లాడఁగ నీకున్. 157

ఉ. నావుడు దేవయానిమదినాటినయల్కనకైన నీకు సం
జీవని పంపుసేయ దని చేరికఁబల్కె నతండు మిక్కిలిం
దా వగ నొంది యో నెలఁత నాకది వమ్మయిపోయె నేనియు
న్నీవనినట్ల నావలన నేర్చినవారికిఁ బంపుసేయదే. 158

క. అని కిన్కతోడ నిటువలెఁ
బనిమాలినపాట నన్నుఁ బలికితి వటుగా
వున నీకు నేల వేలుపు
పెనిమిటి గాకుండు ననుచుఁ బెలుచ న్నొడివెన్. 159

వ. ఇట్టికొమ్మం బలికి కచుండు తననెలవునకుం జనియె నని పలికి శుక్రుండు వృషపర్వుండునుం దోడ నేఁగుదేర వీటికిం దోడ్కొనివచ్చిన దేవయాని శర్మిష్ఠగొలువఁ బాటలం దేటమాటలం దోఁటలం బ్రొద్దుగడపుచు నుండె నంత. 160

చ. కొఱలెడు తేజుచేఁ బసిఁడిగుబ్బలియు న్మఱి వెండికొండయుం
గరఁగునటంచు సంద్రములు కాఁకల నింకు నటంచు నెల్లెడన్
నెఱియు నసంపుఁగప్పురము నించి జగంబులఁ గల్గువార లం
దఱుఁ గొనియాడుచుండఁగ సతంబుగ రాసిరిఁ గన్న నేర్పరీ.

క. పురుకుత్సు రంతిదేవు స
గరుని న్మాంధాతఁ బృథుని గయుని దిలీపున్
భరతు యయాతిం దెగడెడు
సరవిన్ జగములను మించు చాగపుఁగడలీ. 162

మాలిని. నలు మొగములచాలు న్నల్లనౌ మేనిడాలుం
ఝలఁగు నడుగుజాలుం జిందముం జుట్టువాలు

న్వలచు కలిమియాలు న్వన్నెదువ్వల్వ మేలుం
గలుగు నతఁడు నీపైఁ గల్మితో నుండు మేటీ. 163

గద్యము. ఇది శ్రీమదనగోపాలమంత్రప్రసాదలబ్ధసారస్వత సుకవి జనవర్ణనీయవచోవిభవ భావనామాత్యతనూభవ పొన్నికంటి వంశ్య తెలగనార్యప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగు కబ్బంబునందుఁ దృతీయాశ్వాసము.

---

# చతుర్థాశ్వాసము

క. సిరిమీఱినరాజుల దే
వర మానిసితనముపూని వచ్చిన సెకక్
దొరవేలుప బలునిలుకడ
తఱికొండ యమీసుఖాన తలఁపుల నెలవా! 1

వ. అటమీఁది తెఱంగు వినుము. 2

## వసంతర్తువర్ణనము

చ. కరువలి రక్కసు ల్కినుక గ్రిష్మి వడంకఁగ మ్రాఁకువేల్పు
ల్క, దొరకొని యాకురెంటెముల దోఁచఁగ గోవెలకూఁ
తఁ జెప్పఁగా, నరయుచు వారలం గడిమి నామని వెన్నుఁ
డు నొంపఁ జెందు నెత్తురుబలె లేఁజిగుళ్లలరెఁ దోఁపులఁ
జూపఱచూడ్కిపండువై. 3

సీ. అల మింటఁ జెలఁగు రాచిలుకలచాలుపు
ల్వేలుపుమన్నినివిండ్లు గాఁగఁ
బూఁదేనియలఁ జాలఁ బొదలుతేఁటులమ్రోఁత
రఘీమించు సుఖుముల రవలి గాఁగ

మూఁకలై పొడవైన చీఁకటిమ్రాఁకుల
చాళ్లు గార్కొన్న మొగుళ్లు గాఁగ
వెలుతు రీయక జాలువిరితేనియలసోన
వదలక కురియు పెన్వాన గాఁగ
తే. వేడుకలు మీఱఁ దోఁటల నాడుకొామరు
వెలఁదులెల్లను మెఱుఁగుఁదీవియలు గాఁగఁ
గ్రమ్మి యుప్పొంగుచును దొలుకారు వోలె
వలపు నెఱపుచు నామని పొలుపుమీఱె. 4
తే. ఎలమిమై జాజియిారంపు టేనుఁగులను
నొంచు నామని యను తెఱనోటిమెకము
గోళ్లనంగను దగు మోదుగులను మొగ్గ
లమరెఁ దమరంగు మిన్నెల్ల నలమికొనఁగ. 5
క. క్రందుకొను చిగురుజొంపము
లం దగె బలుమావు లంత లలి నెల్లెడలం
జెందిరపుఁగాలిపడగల
నందంబగు మరుని తేరు లనఁగాఁ బొలుపై. 6
మత్తకోకిల —
ఏచె మావులుఁ గ్రోవులుం దగు నిప్పలు న్గరివెందలుం
బూచె నిమ్మలు దాడినిమ్మలుఁ బొన్నలు న్సురపొన్నలుం
గాచెఁ జిన్నులకన్న మున్నుగ గంగరావులు మోవులున్|
రాచెఁ గొమ్మల నింగి గోఁగులు రావులుం గడుతీవులన్. 7
శా. వ్రేలుంగొమ్మలు నేలఁ దారసిలిన న్వ్రేళ్లంగ రాకుండఁగా
లోలోఁ ద్రిమ్మరు నాలిగాడ్పులు పగళ్లున్ రేలుఁ బూఁదా
వులం, జాల న్మిఱిచ్చిలి పోవఁ బట్టుకొని పజ్జం బచ్చ గం

డార్లలో, సోలం గావలిఁబెట్టె వామని యనం జూపట్టె
లేఁదోఁటలన్. 8

తే. అమరెఁ బుప్పొడికుప్ప లై యంతనంత
మెట్టదామరపాకులమీఁద జాఱె
పైఁడిచూలాలివేవిళ్లు వాయఁ దోఁట
కలిమిచెలివెట్టు కలవంటకంబు లనఁగ. 9

చ. చలిమిరిగాడ్పుచే నెగసి సన్నపుసుళ్లగు చాకసంపుమం
దల విలసిల్లెఁ బుప్పొడులు దట్టముగా మదిఁ గ్రమ్ముకమ్మిచేఁ
గలఁగి విరాలిఁ గుందు తెఱగంటినెలంతలమీఁద జొన్పు
పూ,విలుతునిపైఁడిచుట్టలుగు వేలములుం బలె సొంపు
పెంపునన్. 10

క. అగిసెవిరు ల్కాఱువలిచే
నెగయం దోఁ దేఁటిచాల్పు లేఁగుం దఱు చై
తోఁగరాచపదువుల న్వేను
దగులుచు నెలదిండిపండు దార్కొను పగిదిన్. 11

మ. ఎలమిం దుమ్మెదమ్రోఁత వాసె రవలై యింపొంద మత్తిల్లు
కో,వెలసీకారుల కూఁకపాట లమర న్వేవేడ్కతో నాలిగా
డ్పులపేరం గలనట్టువు ల్గఱ ఁ గోపులుప్పొపు లేఁదీవపా
త్రల కయ్యామని పూవుముత్తైపుసరు ల్దాల్పంగ నిచ్చెం
గడున్. 12

వ. మఱియు విరితేనియలాని పూని మత్తిలి తత్తఱంబునం
దిరుగు తేఁటిమొత్తంబుల యెఱకలసన్నం గరువలి గట్టువ
నట్టువ గఱప నామనిరాఱేనికడ నాడులేవపాతరలముందఱ
గ్రందుగా నెత్తిన మవ్వంపుదుప్పటంబులతెరలమరువు లనం

గ్రమ్మ పూదుమ్మలముమ్మరంబులం గ్రొమ్మలం గానక త్రిమ్మరు కలికిరాచిలుక పలుకులరొదల నెదలు గలంగ మెలంగు తెరువరుల నేయ బాసటంబు చిలికిన మరునిచిలుకులు వోని తుమ్మెదదిమ్ముల నలరునలరుం గాంచి వలతేని కాని పనికిం గినుకం గొను తోటకలిమిచెలియచూపులసొంపునం గెంపుపోసనంబు లగు దాసనంబులును, దాసనంబులు చీఁకటి మ్రాఁకుమాకలలోన నిరులుదొరలు తమదాయ యగు వేఁడివెలుంగు నింగికి వెఱచి పఱచిన నతని మెయిపుట్టు గులం బట్టి లోనిడుకొన్నవడువున నున్న గేకిసలుగొట్టు నిర్లపట్టిపిండునుంబోలెఁ జెలంగు కోవెలలును, గోవెల లొగరుంజిగురు లుమియం గని మున్నీటితో సానిన మానికంబులు వెడలించు నించుమొగులుం దెగ లని బెట్టుగా నాడు జొట్టునట్టువపిట్టలు కఱచిలువ తెఱవ లను తలంపు పెంపున జడలకొడియ వడివడిం దీవ యుయ్యెల లూఁగు మగువలనగవువెన్నెలలోన దిక్కులపెక్కువలుం బోలె గానిపించు బొన్నమొగ్గలును, బొన్నమొగ్గల హత్తిన ముత్తైపుందొడవు లయ్యెడనిడి పూఁదేనియల జలకం బాడుతోపు వేలుపుఁజానకు దిద్దిననిద్దంపుఁబసపు ముద్దలయొద్దికం దగు పెద్దనిమ్మపండ్లును, నిమ్మపండ్లయచ్చపుఁ బచ్చడాలు చాలన్నీఱుచుం గారుగోఁగులపై బర్వఁజను పకంబు లని కలంగి తొలంగి చేరక తిరుగు తత్తఱంబుల తేటిమొత్తంబులం గేలిచేసి మించుతీవెచాలన యెలుంగు లనం గులుకుఁబలుకులు గలకలికిచిలుకలును, జిలుక ముక్కుల నొక్కంబడు మారేడుంబండ్లచెన్నుఁ గని తమ

యున్నలచన్నులపోలిక లని విరాలిం జాలింబడు తెరు
వరులం జూచి వగచు మ్రాఁకులకన్నీరునుంబోలె బోరునం
జాఱు పూఁదేనియలును, బూఁదేనియకాలువవాల్ల సుళ్లం
బడి వడివడిం దిరుగు మరునికెంపుబొంగరంబులుంబోని మెట్ట
దామరమొగడలును, దామరమొగడలం దెగడు చిన్ని
చన్నులు గలకన్నియ లన్నుచూపం బూఁదేనియ లాని
తీనియలయందుం బాడునేర్పులకు మెచ్చి పచ్చవిల్కాఁడు
గురియించు విరివానలుం బోలెఁ గరువలిచేఁ దొరుగు పరు
వంబు ననలునుం, గలిగి వలరాజులాయంబునుం బోలె మావు
లకుం దానకంబై చానలసోయగంబునుం బోలె మోవులం
బాపటల సొంపుమీఱి వెలయాండ్రచన్నులచెన్నున గోరం
టలం బొదలి తోఁపు చూపఱకుం బేరామనిగా నామని
యొప్పె నంత. 13

చెలు లుద్యానవిహారము చేయుట

క. తోరపుఁగన్నెల వేపుర
తో రహిఁ శర్మిష్ఠ కొలువఁ దులకింపుచు సిం
గారపుఁదోఁటకుఁ జనియెఁ
గారవమున దేవయాని కడు నాటతమిన్. 14

సీ. మెదలెడుగండుఁదుమ్మెదలపెన్రొదలచేఁ
బొదలెడు గురివెందపొదలఁ దూఱి
కలకలఁ బల్కుచిల్కలకొలంబులఁ జాల
నలరుపొన్నలమూఁగి యలరు లాగి
చెలఁగుచుఁ గిలకిల ల్గులుకుకోవెలలకు
నలఁకువల్గడపు జిన్నలకు నుఱికి

ననలచే మరునిమన్న నలచేఁ జెన్నైన
పొగడలకును దమ్ముఁ బొగడ నరిగి
తే. కలికి యెలదేఁటికదుపుల కలికి యులికి
పెనలుగొనియెడు చిన్నిగుంపెనల కేఁగి
మరల కానట్టుమెట్టతామరలు చిదిమి
తోఁటనాడుచు నెలఁతుకల్ నీటు మెఱసి. 15

ఉ. తొంగలిపూవుఁ దేనియలఁ దూకొని మత్తిలి తుమ్మెదల్పయిం
బొంగుచు వ్రాల నొప్పెసఁగు పూచినపొన్నఁ గడంగి కాంచి
ము,న్మ్రింగినయావిసంబు వెస మీఁదికిఁ బిచ్చిలు వేఁడికంటి
యా, జంగ మటంచు మ్రొక్కు నొకచాన నెలంతలు చూచి
నవ్వఁగన్. 16

క. వడిఁ జనఁ దనయడుగులఁ గల
కడుఁగెంపుఁదనంబు పుడమిఁ గ్రమ్మినఁ దమిచే
నొడితలిరు వడియె నని యటఁ
దడవఁగ నగి రొక్కకలికిఁ దాఁగాడు చెలుల్. 17

చ. మును పొకచోటఁ దుమ్మెదలు మూఁగిన మల్లెలు గోయఁ
బోయినఁ, బెనకువఁ గుట్టినం గలుగుబీతు మదిం దొలఁకంగఁ
గ్రమ్ముచుం, దనకడకంటిచూపు పయిఁ దారొక్కన గొజ్జఁగు
లందుఁ దేంట్లు వ్రాలిన వని చేరనోడి యొకలేమ కడుం
గడఁ జోపుఁ దమ్మిచేన్. 18

పంచచామరము.—సరుల్ పెనంగొనంగఁ జిల్గుఁ జన్నుఁగప్పు జా
ఱఁగాఁ, గురు ల్వెసన్నొసల్ ల్పొసంగఁ గూడి చాల మీఱఁ
గాఁ, దరు ల్బెడంకుచుండ నాని తారసిల్లి యేఁగి క్రొ
వ్విరు ల్గుఱించి కోసె నొర్తు వెంటఁ జాన లంటఁగాన్. 19

సీ. బొట్టుగు లేమావిఁ బొదలించె నొక్కర్తు
చూచియుఁ జేనంటి సొబగుమీఱ
బొన్నఁ బ్రేంకణమును బూయించె నొక్కర్తు
చిరునవ్వునునుఁబాట దుఱఁగలింపఁ
బొగడను గంకేళిఁ దగ విరుల్గలిగించె
నెమ్మిఁ గల్లుమిసి తన్నియు నొకర్తు
కొసరి వావిలిఁ గొండగోఁగును ననిపించె
మూర్కొని మాటాడి ముదిత యొకర్తు
తే. క్రోవిఁ బూవుల నిండించె గొమ్మ యొకర్తు
కదసి కూరిమితోడుతఁ గౌఁగిలించి
చనుపకంబునఁ గ్రొన్ననల్ దనియ నించె
ముదిత యొక్కతె తనముద్దుమోముఁ జూపి. 20

సుగంధి. చాలుఁజాలు నెంతకైనఁ జాలు నున్నగన్నెరుల్
రేలపూల కేల గోల రేయ నిందులోనఁ బో
నేల తాళు మన్న నన్ను నెట్టు దిట్టె నక్కటా
మేలుమేలు ముద్దరాల మెచ్చువచ్చు నామదిన్. 21

వ. అని మఱియు నొక్కయెడ. 22

క. చెలి తీవయురియ్యె లూఁగఁగ
నలరుం జడయు న్మొగంబు నలుకమెయిం జొ
బిలిదిండి దగుల నెలయుఁ
దులదుల వెనుకకును గడిమి త్రోపాడురహిన్. 23

తోటకము.—
పొలుపు ల్గనుఁగో వలపు ల్గొలుపుం
దొలుకారు మెఱుంగులతో నెనయై

వలరాచసిరు ల్వాలె వా రొ్కచోఁ
బలుపొ గురివెందల పందిరిలోన్. 24

సీ. చిన్నారి పొన్నారి చిఱుతపాయంబులఁ
జెలఁగునంచలఁ బెండ్లి చేసిచేసి
యెలజవ్వనపుమంపు గలిగి పెంపున మించు
చిలుకలఁ బాన్పుపైఁ జేర్చిచేర్చి
పూలతేనియలందుఁ జూజాలిగొరువంక
పిండు గంట్లంబులఁ బెట్టిపెట్టి
కోవెలబాలెంతకొమ్మల కిమ్ముగా
నొనరించి తగఁ బురు డోమిరోమి
తే. పల్మఱును దేఁటి చిన్నిపాపలకుఁ గులికి
పువ్వుఁదేనియ నుగ్గులు పోసి పోసి
కడలుకొను వేడుకలతోడఁ బడఁతు లందు
వెడలి వెండియు నొకచోట విరులు చిదిమి. 25

రగడ.—

మావులు దగుమరుమావుల కిరవులు
తావులకును గడుతావుల విరవులు
కోవులె మదిఁ గైకోవులె కన్నియ
మోవులు పగడపుమోవులు వన్నియ
గుంపెనలకుఁగా గుంపెన లేఁటికి
లంపుల విరులతలంపులు బోఁటికి
మానుపమోదుగ మానుప నేదగు
కానిక పూవిలుకానిక యీఁదగు
వేసవి పువ్వులు వే సలి జాతేడుఁ

గానవె యొప్పులుగా నవె మీఁ తెడుఁ
బొఁగడను మాటికిఁ బొఁగడను నెచ్చెలి
మొగలివిరు ల్పూ మొగలివె నెచ్చెలి
రంతేటికి గోరంతే మల్లెల
వంతులకా సేవంతులఁ జెల్లెల
చనుపకములు గొనఁజనునే మాటికి
ననవిల్తుని మన్ననగల మేటికి
నెమ్మినుండి యానెమ్మికి వదరెడుఁ
గొమ్మా పొన్నలు గొమ్మా పదరెడుఁ
జాలుం జాలని జాలవి యీవిరి
గోలయిచ్చు బరిగోలదె వావిరి
మారేటికిఁ బలుమాత్రేటికిఁ జన
గోరంటలఁ గొనగోరంటవె నన
విరిగి పయింగడు విరిగిరి చానలు
విరులు గలుగు క్రొవ్విరిగా వానలు
దమ్ములు దగియెడుఁ దమ్ములపేరిట
నెమ్మెలఁ గొనఁ దగనెమ్మెల మీఁరిట
రాకః నెలంత పరాకున నిమ్మకు
మాకు లదే మఱి మాకికఁ జిమ్మకు
మబ్బెందలె మాఃబ్బెందలె చెలి
గుబ్బెత యది యాగుబ్బెత గన్నలి
కారనకే యొడికాగపుఁగింకను
నేరము మాకిది నేరము బొంకను
నీడకుఁ జెలిరా కీడకుఁ గోయఁగ

నాడకురా విడనాడకు పాయఁగఁ
బనసలపైఁ బూఁబనసల్ గనుఁగొను
పనుపడ్డవి మరుపనులకు నవి మును
మరువము చెలి నామరువములో యను
కలివో విరు లక్కలివోఁ గోయను
మాటకు మూరక మాటకు వత్తురె
బోఁటులు మఱి విూబోఁటులు మెత్తురె
యనుచుఁ దగిలి సయ్యాటలఁ బాడుచు
ననవిలుకాని వినం గొనియాడుచు. 26

వ. ఇట్లు నీటుమెఱసి తోఁటల నాఁడుబోటు లాట సాలించి. 27

క. కప్పుంగొప్పులఁ జన్నుం
గప్పుల మొగముల నొడళ్లఁ గప్పినమెఱుఁగుం
బుప్పొడి విదిరిచికొని మఱి
యప్పడఁతుక లరిగి కప్రపనఁటులచెంతన్. 28

సీ. పువ్వుఁదేనియకాల్వపొంతఁ బొన్నలలోన
బొలుపొందు చెంగల్వకొలనిదరిని
బూచిన చనుపకంబులఁ జుట్టివచ్చిన
గురివెందతీవపందిరులయందుఁ
జలువలనెలవులై యలరారునెలత్రాల
తిన్నియ ల్పన్నీటితేట నలికి
విరివిల్తు నతనిదేవేరిఁ గస్తురిఁ దమ్మి
రేకుపై వ్రాసి గుఱించి నిలిపి
తే. కమ్మవిరినీట జలకంబుగాను గూర్చి
నగవుముత్యాలతొడవులు దగ నమర్చి

కలికి క్రొన్ననపాదబాసికములు చేర్చి
సిరుల నెదిరించుచును బెండ్లి సేయుచుండ. 29

తే. నాలిగాడ్వను కాలరి యోలి నరిగి
వారివేనలి విరుల నింపారుతావు
లెల్లఁ గానుకగా నిచ్చి యెలమిఁ బిలువ
నచట వేఁటాడుచున్న యయాతి వచ్చి. 30

క. తెలిమొగులులోన వెల్గెడు
తొలుకారుమెఱుంగుపగిదిఁ దొరఫుటొలపుల్
తులకించు నాటతమిచే
నలరుంబొద వెడలివచ్చు నలశర్మిష్ఠన్. 31

యయాతి శర్మిష్ఠం గాంచి వర్ణించుట

వ. కాంచి యగ్గుబ్బెతసోయగంబున కబ్బురపడి యబ్బలియుండు తనలోన. 32

సీ.*తమ్ములు చుక్కలు తాఁబేళ్లు మరుపొదు
ల్పసిఁడి యనంటులు నిసుకతిప్ప
సుడి చదల్ బంగారుకడవలు తీవియ
ల్చివురు చిందంబు పసిండి యద్ద
ములు తలిర్వెన్నెల మొల్లమొగ్గలు నువ్వుఁ
బువ్వు మీలు నన దూపులును విండ్లు
నరతొగదొర సోఁగసిరి వ్రాఁత చెలువముల్
రహిమించు జేజేలరాచబాలు

తే. నివిగదా పోలికలు చూడ నింతులందు
నొడలియొప్పులు గొనియాడుచున్న యెడల

*ఇది ప్రభావతీ ప్రద్యుమ్నములోని పద్యమునకుఁ బోలిక.

నవి బెడంగుగ నీచానయందు సాటి
సేయవచ్చిన నేరికి సిగ్గుగాదె. 33

తే. మరునియురు లనఁదగి తేఁటిసిరులవఱలు
తెఱవకురులకు సరిరామిఁ దీఱేఁగాక
కడిమిఁ దమపెంపువోఁ బూరి గఱవనేల
రహియఱఁ వేలుపునరాచరాలకెల్ల. 34

క. మరుఁ డరనెలకడ డాఁచిన
విరిదూపును నల్లచెఱకువిండ్లునుబలె వే
మఱు నలరుఁ జేరుచుక్కయు
నరుదగుకనుబొమలు మిగుల నతివకు నమరెన్. 35

క. నెలఁతుక కన్నులనంగాఁ
బొలుపగు నెలవెలుఁగు మేపుఁబులుఁగులు తమిచేఁ
గొలఁది యెఱుంగక తిని వె
న్నెల గ్రక్కెడుననఁగ నెసఁగు నెలకొను నగవుల్. 36

క. తమ్ములఁ బూవిల్తుని క్రొ
త్తమ్ములఁ జీరికిని గొనక యడకించుఁ గడుం
గొమ్మనిడువాలుఁగన్నులుఁ
గ్రొమ్మించులు గలిగి పొలుపుగులికెడు చూపుల్. 37

తే. పెలుచఁ దమదాయయైన సంపెంగవిరిని
గెలిచె నని ముక్కు నిరుగడఁ గొలిచి యుండి
త్రుళ్లియాడెడు తుమ్మెదపిల్ల లలఁగఁ
బొలుచు నెలఁతుకచూపులు చెలువ మమర. 38

తే. కప్పురముపాదులోపలఁ గరము సరది
నాటి వెన్నెలయను తేటనీటఁ దడుప

మొనలు చూపిన ముత్యాల మొలక లనఁగ
నొరపుతోడుతఁ జెలిపలువరుస దనరె. 39

క. లలిఁ బంచదారలోపలఁ
దిలకింపఁగ నించి జుంటితేనియలు కడుం
జిలుకఁగఁ బెరిఁగిన పగడపుఁ
దలి రనఁగా నతివ పెదవి తగుఁ గొనియాడన్. 40

తరల. చిలువతెంకి మొకంబు చెట్టని చెప్పఁగొందురు చెల్ల యీ
పొలఁతినెమ్మొగముం గడంకను బోలఁజాలక నెమ్మదిం
గలఁగి చుక్కలరాయఁ డెంతయుఁ గంది వెల్వెలఁబాఱఁగా
కలరువిల్తుని మేనమామగు నయ్యు కాకొద గల్గునే. 41

తే. చెలువమెడ తుంటవిల్తునిచింద మరయ
నందు నిరుగడ వైచినకుందనంపు
సరులు పూఁబోఁడిచేతులు చాలనరయఁ
గాక యుండిన నీగరగరిక గలదె. 42

చ. చెలినుదురుం గడుందొరయ నేమముతో నెల కుండఁగల్గెన
వ్వలిమలయల్లువానితల వాడనిపువ్వయి నిచ్చ నేము నీ
నెలఁతుకచేతులం బడిన నేలరదంబగు వేల్పుదాల్పు న
ర్మిలి నని చేరె నమ్మొగలిరేకులనందగు వాఁడిగోళ్లొగిన్. 43

తే. అతివచన్నులు జక్కవ లగుట కేమి
సందియం బింక దండలచాయ నిగిడి
తెక్కలై యుండ పొంపునఁ బిక్కటిల్లి
వలిపపయ్యెద యనుచిన్నివలను దగుల. 44

క. గరగరిక నిచ్చగలుగక
బురుదం గలఁగుటయ కాక పొలుపఱఁగాఁ దా

మరమొగ్గలపేరిటి తా
మరమొగ్గలు పోలఁగలవె మగువచనుఁగవన్. 45

క. బంగారుఁదీవయుం బలె
నంగునఁ దగుపొలఁతిమేన నారు దనర్చుం
బొంగారు మెఱుఁగులోపలి
సింగారపుమిసిమి గ్రమ్ముజీరయ పోలెన్. 46

చ. మురువునఁ దమ్మిచూలి మదిముంద తెఱెంగినయట్లు నేర్పుతోఁ
దరులను పైఁడికట్టులను దానె తిరంబుగ నుంచెఁగాక యే
వెరవున నిల్పు దీనిదగు వ్రేఁకపుగుబ్బల వ్రేఁగునం జదల్
దొరసినయట్టి నెన్నడుము తోరపునల్వకడంక మెచ్చితిన్. 47

క. ఎన యిసుకతిప్ప యని చె
ప్పిన నేమనవచ్చుఁ జెలియపిఱుఁదుంబలెఁ దా
నునుపో యది యటువలెఁ గడుఁ
దనుపో కాదనరు దానిఁ దద్దయుఁ గడకన్. 48

క. పలుదెఱఁగులఁ దమనేరుపు
కొలఁది న్నెఱజాణ లెల్లఁ గొనియాడిన ని
య్యెలనాఁగ మెఱుఁగుఁదొడలం
దలక్రిందైనను నరంటితరమా పోలన్. 49

క. తలఁకకు మని యేకతమునఁ
బలికిన మొఱవెట్టునపుడె పరికింపంగాఁ
బొలఁతుకచిఱుదొడలం గా
ళులు వోలమి డాఁగె వెఱచి లెక్కింపంగాన్. 50

మ. తమకుంబోలికలైనవే యను మదిం దాఁబెళ్లఁదామల్కతో
నెమకన్నీళ్ల మునింగియున్నవన నెంతే నొప్పు నుగ్గోళ్ల నం

దములైమీఱెడు తెల్ల డాలుగమిలోనం గొమ్మమీఁ గాల్గొచూ
చి మదిం జూడఁగ వీనిసాటి గలదే చెప్పంగ నెచ్చోటనున్.

వ. అని యిట్లు నెమ్మది నక్కొమ్మసోయగంబులు కైవారంబులు సేయుచున్నంత. 52

సీ. బలుమించు తలమించు నలిమించు సిరిఁబొల్చు
మేచాయ విరుల సంపెఁగలఁ జేయ
నెలతిరుఁ బలుమోము లలిఁ గేరు నెమ్మోము
చెలఁగి తమ్ములను దమ్ములను జేయ
జగడాలఁ బగడాల నగుడాలు గలమోవి
చెందమ్మి రేకులఁ జివురు సేయఁ
గరము చీఁకటి గప్పు కప్పు వేనలియొప్పు
తేఁటుల కొంకవింత నీటుసేయ

తే. నలువ జగములఁ గలిగిన పొలుపు గరఁచి
యెంచి వెన్నెల కరువులో నించి యతివఁ
గాఁ దలంచెఁగఁబోలు నీకలికి నవుర
యనఁగ నటవచ్చు నద్దేవయానిఁ గాంచి. 53

వ. మున్న న్నెలంత నెఱింగియు నెఱుంగనివాఁడ పోలెఁ జక్కం దనంబునకు నిక్కయగుశర్మిష్ఠం దెలియవలసి యక్కొమ్మ కిట్లనియె. 54

యయాతి మీ రెవ్వ రని దేవయాని నడుగుట

క. పలుమాఱు నిందువత్తును
దొలుత నినుం జూచి యెఱుఁగఁ దొయ్యలి నీకుం
గుల మెయ్యది పే రెయ్యది
యలకొమ్మయు నీవు నేమి యగుదురు ప్రావిన్. 55

వ. అనవుడు. 56

సీ. మున్ను నన్నెఱుఁగుదు విన్నాణి వృషపర్వుఁ
డనుతోలువేల్పు రాయనికొమార్తె
శర్మిష్ఠ నాఁగ నీచాన నన్నలనాఁడు
నీట ద్రొబ్బించిననెలఁత గాదె
నాఁటితప్పునకు నీనసఁబోండ్లతో నాకు
వరవుడై యున్న దీవాలుఁగంటి
ననుఁ బెండ్లియాడి మన్నన దీనిలోనుగాఁ
గలనెలఁతుక లూడిగములు సేయఁ

తే. గడలి బుట్టిన పొలతుకల్ కదిసి కొలువ
వెలయు నలవేయిగన్నుల వేల్పువోలెఁ
బెంపుతో నిచ్చఁ గడలేని సొంపుమెఱయఁ
బుడమి నాతోడిసవతిగా నడుపవయ్య. 57

వ. నావుడు నతం డిట్లనియె. 58

ఆ. చెలియ రాచకన్నియల నేలవేలుపు
ల్తగిలి పెండ్లి యాడఁ దగవు గాక
పుడమి నేల వేల్పుఁబువ్వఁ బోడుల రాజు
లెలమిఁ బెండ్లియాఁడ దలఁపఁదగునె. 59

క. అని పలుకు రాచవేలుపుఁ
గనుఁగొని చిఱునగవు మోముఁదమ్మిం గమ్మం
దనరఁగ నచ్చేడియ యి
ట్లనియె న్మదిలోనఁ గోర్కు లనయముఁ బొదలన్. 60

తరల. కడఁగి విన్ను వెలుంగు డాఁగుఱేగాఁగ నబ్బలుకానలో
నడలుచున్న ననుం గనుంగొని యప్పు డర్మిలి నూతిలో

వెడలఁదీయుచుఁ గేలువట్టితి వేకదా యిఁక బెండ్లికిం
గడమ లెల్లను సొంపు లింతియె కాక మీర లెఱుంగరే. 61

క. చదువులకు నొజ్జయై కడుఁ
బొదలిన నాయయ్య పొత్తపుంగూర్పరి చే
నిది తగ వనిపించెద నె
మ్మదిలోపల నీకు నింత మనికత మున్నన్. 62

వ. అనవుడు. 63

### శుక్రాచార్యులు యయాతిదేవయాను లున్నకడకు వచ్చుట

క. అట్టేని పెండ్లియయి చే
పట్టెద ని న్ననుడుఁ బొంగి పడఁతుక సోఁకుం
బట్టపుటొజ్జల నటకు
న్నెట్టనఁ బిలిపించె నతఁడు నెలదాల్పుబలెన్. 64

చ.*చనుదేరం గని మింటిమానికము నిచ్చల్ పోవు మజ్జారె
యా,వినుత్రోవ న్నడయాడకేలయిటకు న్విచ్చేసెనో యబ్బు
రం,బనఁగన్నులిమ్ముమిట్లుగొల్పు మెయిచాయ ల్గాయ నీ రెం
డలం,దనయున్నట్లుగఁ జేరవచ్చు నతనిం దాదవ్వులం
జూచుచున్. 65

క. వడిఁ బుడమి తేఁడువలె వా
టిడుకొన్న పసిండివ్రాఁత నెసఁగెడు వలువ
న్నడుము బిగియించికొని మఱి
యడుగులపై వ్రాలి లేచి యతఁడును దానున్. 66

క. చనుదెంచి యివముగ్రమ్మెడు
చనుపకములలోని మావిచక్కిం దగుక్రొ

---

* 'నీరజమిత్రుఁ డేలధరణీగతుఁ డయ్యెనొ' అను నన్నయపద్యమువంటిది.

న్ననచప్పరంబులోపలఁ
దనరెడు కప్పూరపుజగతిఁ దమి నున్న యెడన్. 67

క. నెమ్మదిఁ గూరిమి చెలులగు
కొమ్మలు వేపురును గొలువఁ గ్రొమ్మించులలో
నిమ్మగు లేనెలయుంబలె
నమ్మెయికిని వచ్చి దేవయాని కడంకన్. 68

ఆ. మ్రొక్కి లేచి కేలు మోడ్పుచుఁ దనచంద
మెల్లఁ జెప్పి యయ్యయాతిఁ జూపి
తలఁచిమాడ ము న్నె తగులైతిఁ గావునఁ
బెనిమి టితఁడె నాకు వినుము తండ్రి! 69

ఉ. ఈవిరిఁబోఁడిఁ జైకొను మిదేటికి సందియమంచుఁ గూరిమిన్
దేవర యానతిచ్చిన మదిం దుళకించుచుఁ బెండ్లియాడెదన్
రావలరాజు నన్నును దిరంబుగ సొంపునఁ బెంపుమీఱఁగాఁ
గావునఁ గూతుఁగావలసి కాదన కీచను వీయఁగాఁదగున్. 70

తే. ఇతని కీయక మదిలోన నెంచ నన్ను
నొరుల కొసఁగఁ దలంచిన నొకటి వినుము
తగనిపనియన కెన్నిచందములనైన
నొడలు దొఱఁగుదు నిపుడు నీయడుగులాన. 71

క. అని తెగువఁ బలుకుకూఁతును
గనుఁగొని మదిలోనఁ గూర్మి గడలుకొనంగాఁ
దనరి యతఁ డియ్యకొనియెం
తనతలఁపున గచునిమాటఁ దలపోసి వెసన్. 72

యయాతి దేవయానిం బెండ్లియాడుటకు శుక్రాచార్యులు సమ్మతించుట

వ. ఇట్లియ్యకొని రాకాసిరయొజ్జ తనపజ్జనున్న యయాతిం జూచి

నీకు నిర్దేవయానిం జేకొనవచ్చు నని యొడంబరిచి యారా
జునుం గూఁతును దోడ్కొని వీటికిం జనుదెంచునప్పుడు
వృషపర్వుం డెదురు వచ్చి తననగర విడిది సేయుటయు
నతండు. 73

సీ. పదియాఱువన్నెల బంగారునునుజీని
పనిగడియార ముప్పరిగ గడచి
దురములోఁ దెలుగంటిదొరను గెల్చిననాఁటి
కతలు వ్రాసిన తొట్టికట్టు దాఁటి
రేరాచబాలఁ గూర్చిన రచ్చపట్టులో
రహిఁబాడు పాటల రవలి యరసి
తలపురానేల సంతనచేసినట్టి పెం
జగతిపై ముత్యాలచవికె యెదుటఁ
తే. దమ్మికెంపులుగట్టిన తావులందు
వారువము నిల్పి తనవెంట వచ్చినట్టి
మన్నె వారల ననుపుచు నున్నయెడను
జెంత వృషపర్వుఁ డప్పుడు చేర నరిగి. 74

మ. ఘాలుపౌ కప్రపనంట్లు కస్తురిమెకంబుల్ మేలి జవ్వాది పి
ల్లులు రాచిల్కలు మానికంబులును జిల్గుల్ మంచిముత్యాల
పేరులు మేల్బోగపురెంటెముల్ పసిఁడితేరుల్ పల్లకుల్
లోనుగా,నులుపాచేసె యయాతికిం దలఁపులో నుప్పొం
గుచుం గూర్మితోన్. 75

వ. మఱియును. 76

సీ. జేజేలదొరప్రోలు చెఱపట్టి తెచ్చిన
ఘాలివోని యచ్చరపువ్వుఁబోండ్లఁ

దామరచెలిపట్టి తావు గొల్లాడఁగాఁ
దగులుపడ్డట్టి యేనుఁగులగముల
నని గెల్చి నీటిరాయనివీడు చూఁతాడి
వాతి కైకొన్నట్టివారువముల
నిగుడి జక్కులతేని నెలవెల్ల దోఁచఁగాఁ
గలిగిన వేల్పురాకంటసరులఁ
తే. గోట్లకొలఁదులు బంగారుకొలువుసాల
ముంగలను నిల్పి మదిలోనఁ జెంగలించి
చేరి కానుకచేసినఁ జిత్తగించి
యుడుగరలనంది వృషపర్వు విడిది కనిపి. 77
క. తేజీ డిగి తనయంతటి
రాజులు మే లప్ప యనుచు రాఁగాఁ జని తాఁ
దేజునను మేడలోపలి
జాజులచప్పరములో నెసంగుచు నుండెన్. 78
తే. అంత రక్కసియొజ్జ దానానతిచ్చి
పంప వృషపర్వుఁ డప్పుడు సొంపు మెఱయఁ
బలు దెఱంగులఁ దనపౌరుపత్యకాండ్ర
చెలువు మీఱంగ వీడు గైసేయఁ బనుప. 79
చ. అలవలరాజుచేతి యలరమ్ము లనందగు లేమి చెల్వపుం
బొలఁతులమోముఁదామరలఁ బోలని సిగ్గున వీఁగి పెక్కు
రూ,పులఁ జని వారివాకిళులపొంతలఁ జేరిన నిండుఁ
జందమా, మలవలె మీఱె రంగు లలమం దొగదోరణ
ముల్ బెడంగు లై. 80
క. గందపుమ్రాఁకుల కురుఁజుల
సందులనుం బూల చలువచప్పరములుగాఁ

బొందింపఁ గ్రమ్ముచీఁకటి
మందటిలెక్క మేలుకట్టుమానికములచేన్. 81

సీ. ఏదారిఁ జూచిన మేదించి జవ్వాది
బురదతో గోడలు పూయువారు
నేతావుఁ జూచినఁ బ్రాఁతజాలూడ్చి నె
త్తమ్మి కెంపుల గనెల్ దాల్చువారు
నేవీదిఁ జూచినఁ దావు లుప్పొంగఁగా
విరులచేఁ బందిళ్లు వేయువారు
నే తిన్నెఁ జూచిన నించుమించ చగుపట్ల
నించి కప్రంబు గ్రమ్మించువారు
తే. నెచటఁ జూచిన నాణిగా నేర్పరించి
పెద్దముత్యాల ముగ్గులు వెట్టువారు
నెందుఁ బొగడపుమేరువు లెత్తువారు
నైరి వీటను గలిగినవార లెల్ల. 82

వ. అప్పుడు. 83

## దేవయానివివాహసన్నాహము

ఉ. ఎల్లియ సోఁకుటొజ్జ యతఁ డేపునఁజేయును గూఁతుపెండ్లి
యం, చల్లన పైఁడిపళ్లెరములందును గందముఁ బూలుఁ
బచ్చఁబ్రాల్, పెల్లుగ నించి పొల్తుకలు పేరఁటముల్ దగఁ
జెప్పి వీటిలో, నెల్లెడఁ ద్రిమ్మరం దొడఁగి రింపుగ వాయిద
ముల్ చెలంగఁగన్. 84

మ. వరుసన్ శుక్రుఁడు నాఁడు వేగఁ దనచెల్వాన్ జూచి యీ
కన్నెకున్, దొరయౌ రూపును బాయముం గలిగి చెన్నుం
గల్గు నీనేలఱేఁ, డరుదై కల్గెఁ దలంచినట్ల యెడ సేయం

బోలునే యింక నేర్పరు లా కొమ్మలఁ బంపుమా తగు
పనుల్ గావింప రాణింపఁగన్. 85

క. వివరింప నెడము లేదిఁక
నువిదకు శోబనపుజలక మొనరింపంగా
జవరాండ్రఁ బనుపు మనవుడుఁ
బువుఁబోఁడియు నలరి తగినపాలఁతులఁ బనిచెన్. 86

క. పనిచినఁ గొందఱు నెలఁతలు
ననిచినసంతసముతోడ నగవుదొలంకం
జని యుదిరిపైఁడికళుకుల
పనిమెరవడి నలరు గరుడపచ్చలచవికెన్. 87

చ. కలికి యొకర్తు చేఁదుడువఁ గస్తురిచే నరఁ గల్కె నొక్కపై
దలి యొకకొమ్మ ముత్తెములు దార్చెను మ్రుగ్గుగ నొర్తు
పెట్టెఁ గెంపులపని పెండ్లి పీఁట యొకబోటియు బంగరుచేల
వైచెనొర్తు లలిని దేవయానిఁ దగఁ దోడ్కొని వచ్చెను
వేడ్కతో వెసన్. 88

సీ. కొప్పు మెల్లన విచ్చి కురులు చిక్కెడలించి
తలయంటె నేర్పుతోఁ బొలఁతి యొర్తు
పసుపుతోఁ గూడఁ గప్రము చాల మేదించి
నలుఁగు పెట్టెను గూర్మి మెలఁత యొర్తు
మించి తావులుగ్రమ్ము మంచిగందమ్మున
నటకలి యిడియెఁ దొయ్యలి యొకర్తు
బంగారుబిందెలఁ బన్నీరు గుల్కుచు
జలకమార్చిరి కొంద ఱలరుఁబోండ్లు

తే. వలిపపావడఁ దలయొత్తెఁ జెలియొకర్తు
కదిసి చెంగావిదువ్వల్వ గట్టె నొకతె
నెరులు నేర్పునఁ దడియార్చె నెలఁత యోర్తు
చెలఁగి జాజులు వేసలిఁ జెరివె నొకతె. 89

సీ. మట్టెలు పిల్లాండ్లు మఱిపీరమద్దియ
లెలమిని దొడిగెఁ దొయ్యలి యొకర్తు
గంటలు మొలనూలు కడిఁదియొడ్డాణంబు
నుంగరంబులు వెట్టె సుదతి యోర్తు
ముత్యాలపేరులు మొగపుఁదీఁగెయు బన్న
సరములు గీలించె జాణయోర్తు
పచ్చలకడియముల్ బంగారుగాజులుఁ
బదకముల్ సవరించె ముదిత యోర్తు

తే. తమ్మికెంపులపంజులకమ్మదోయి
చేరుచుక్కయు ముంగర చెవులపువులు
బవిరలును గొప్పువలయును బడఁతి యోర్తు
దిద్దెఁ గస్తురినామంబు దీర్చె నోర్తు. 90

క. పొలఁతి మొగముఁ బోలుదు నని
మలయంగా నిండుఁ జందమామను వడిఁ దొ
య్యలికడకుఁ బట్టి తెచ్చెనొ
యలరుచు నన నొకతె నిలువుటద్దము నిలిపెన్. 91

క. కారుమెఱుం గన మరుదే
వేరియుఁ దా ననఁగఁ బైఁడివిరిదం డన బం
గారపుబొమ్మనఁ గా సిం
గారంబున దేవయాని కడుఁ జెలువొందెన్. 92

వ. అంత నక్కడ. 93

సీ. పచ్చలపనినొప్పు పైఁడిముక్కాలిపీఁట
యిడియె వేడుకతోడ నింతి యొకతె
కైదండ లిచ్చి రాకలువరాయనిఁ దెచ్చి
యందుమీఁదట నుంచె నతివ యొకర్తు
సవ తెచ్చటను లేని చౌకట్టుపోఁగులు
తిగిచెఁ గొల్కు లెడల్చి మగువయొకర్తు
కడుమించు డాకేల గండపెండేరంబు
మెల్లన వదలించె మెలఁత యొకతె

తే. వచ్చి సికజాజిసరములు విచ్చె నొకతె
కంటసరులును ముత్యాలకడియములును
బదకములు లోనుగాఁగల బలుపుసొమ్ము
లొయ్య నొయ్యన సడలించె నువిద యొకర్తు. 94

క. నెలవంటిమొగము చెమ్మట
మొలకలఁ దగఁ గొనువణఁక ముంగురు లాడన్
దలయంటె నొకతె తేనికఁ
గలపంబునఁ జేసి శావిగట్టినసూనెన్. 95

క. సరి చేతొడవులు మ్రోయఁగ
సరగ నెఱులు దువ్వి దువ్వి సరసందముగా
సిరిగందపు టటకలి యిడె
విరిఁబోఁడి యొకర్తు రాచవేలుపుదొరకున్. 96

చ. జలకములందు లేవనుచు సందియమొప్పఁగ నూరకున్నఁబై
దలిని గికాకికర్ణ నగుచుఁ దామరకంటి యొకర్తు తేటవె
న్నెలఛటికంపు బిందియల నించినగొజ్జఁగిపూవుసీటిచేఁ

దలగడిగో యయాతికి నెదం గడు సంతస ముల్లసిల్లఁగన్.
వ. అప్పుడు. 93
క. ఎలనాఁగయొకతె దలిమపు
వలిపంబులు గట్ట నిచ్చె వడి నడుగులఁ బా
వలుదొడిగ నొకతె యొక్కతె
తలఁ బావడయొత్తి తిగిచి తడియార్చెఁ దగన్. 99
సీ. నిలువుటద్దం బొకనెలఁత చూపఁగ నోర్తు
క్రొన్నెలనామంబు గోరఁ దీర్చెఁ
గలికి యొక్కతె రాచకల్వ రాయని మేనఁ
గలపంబు చేసినగంధ మలఁదెఁ
జాన యొక్కర్తుక చనుపకంబులసరుల్
చింగులువారంగ సిక నమర్చెఁ
జెలువ యొక్కతె గప్పెఁ గలికిరాయంచంచు
బంగారు చెఱఁగులపచ్చడంబు
తే. పరఁగ వెలలేని చొకట్లు బన్నసరులఁ
బసిమినొప్పారు పచ్చలపతకములును
గండపెండేరములు లోనుగాఁగఁ గలుగు
సొమ్ము లొకయింతి గైచేసె సొంపు మెఱయ. 100
క. ఎడలేదు లగన మనుచున్
బడిబడిఁ బిలువంగ నపుడు బలువాయిదముల్
గడలుకొనంగా నచ్చర
పడఁతులదవళములు పెండ్లిపాటలు సెలఁగన్. 101
క. వెలియేనుఁగుపైఁ బన్నిన
యళరుంజప్పరములోన సతివలు వీచో

పులు వీవ ఱేఁడు రెండవ
వలరాయని పగిది వచ్చి వాకిట దిగియెన్. 102

తే. కలికి యొక్కతె మగమానికములగిండి
నించి పన్నీరు వోయఁగా నేలఱేని
యడుగుఁదమ్ములు గడిగెఁ దొయ్యలి యొకర్తు
తుడిచె నెలగావిపయ్యెదతుదఁ జెలంగి. 103

ఉ. కారుమెఱుంగులం దెగడుకైపున నొప్పునెలంత లంత బం
గారపుఁబళ్లెరంబుల వగ న్నునుముత్తెపుముగ్గులోన నిం
పారెడు కెంపుదివ్వియల నందపుఁగెందొడవు ల్చెలంగఁగా
నారతు లిచ్చి రప్పుడు యయాతికి లేనగ వొప్ప నర్మిలిన్.

## వివాహాము

ఉ. తామరకెంపు లంతటను దాచినముక్కాలిపీటమీఁదటం
గోమలులంతఁ బెండ్లికొడుకుం దగనుంచినఁబొల్పుమీఱఁగా
బ్రామినుకుం దెఱంగునసురక్కసియొజ్జ యొసంగెఁగూఁతును
గోమునఁ బెంచుకోర్కిసమకూరుటకుం దనబాసమెచ్చఁగన్.

సీ. అలనాఁడు జగములు గెలిపించినను మెచ్చి
తారకుం డిచ్చినవారువములు
కని పైఁడికంటిరాకాసిఱేఁ డిచ్చిన
పాఁపమేపుడుపచ్చపతకములును
శివితోఁ గొడుకుపెండ్లికిఁ బిల్వ నరుదెంచి
బలి తెచ్చి యిచ్చినబన్నసరము
తనకు వేలుపుఱేఁడు తలఁకి కానుకసేయ
వృషపర్వుఁ డిచ్చిన వెలఁదిపిండు

తే. నేమిసేయించునో యని యెదఁ గలంగి
కడలి యంపిన బలుమానికములు మఱియు
మాము యల్లున కిచ్చె గారాము మెఱయ
హెచ్చుసొంపునఁ గూఁతును నిచ్చునపుడు. 106

వ. అంత నిట్లు కావించి తెరమఱుంగున నప్పుడమితేని నునిచి
ననుచుతమిం దనకూఁతుం దోడితేర శుక్రుండు పనుచు
టయు. 107

సీ. అడుగుఁదమ్ములచాయ పుడమియొత్తకయుండఁ
జిగురుమించినిలీవిఁ జెలువ మమర
ముదిత యొకర్తు పయ్యెద చెఱంగున సారె
చెక్కుటద్దంబుల చెమట దుడువ
మోమువంపఁగ జాఱుముత్యాలపాపట
సకియొకర్తు పలుమాఱు చక్క నిడఁగ
వావిచ్చఁ గప్పుపల్వరుస చీఁకటిగ్రమ్మ
మరియొకర్తు తెలనాకు మడిచి యొసఁగఁ
తే. గలికికన్నుల దూపులు గ్రమ్మికొనుచు
నిగుడఁ బటికంపుటాకట్టునేల యల్ల
నలరుకస్తురినాటిన యట్లుగాఁగఁ
దెలివిఁ జనుదెంచెఁ గడునాన దేవయాన.* 108

వ. ఇట్లు వచ్చిన తెఱవం దెరమఱుంగున నడి తగుతెఱఁగులు
గావించినపిదప నత్తెర దిగిచినసమయంబున. 109

---

* భారతములో "వరుణేంద్రు దేవియ, పోనిదాని దేవయానిఁగనియె" ఇత్యాది దేవయాని యనియే యుండుటచే నిందంతట నాపాఠప్రకారమే యుంపఁబడినది, "కడునాన దేవయాన" అని యిందున్నది.

ఆ. తాళి గట్టె నపుడె తలిరాకుఁబోఁడికిఁ
బుడమితేఁడు వేడ్క గడలుకొనఁగఁ
దనరు పెక్కువాయిదమ్ములమ్రోఁతలు
చెలఁగి ముజ్జగములు చెవుడుపఱుప. 110

క. చెలి యొకతె యెత్తి పట్టినఁ
దలిరాకుంబోఁడి ఱేనితల ముత్తియపుం
దలఁబ్రాలు వోసినతుద
న్నెలఁతుక తలఁబ్రాలువోసె నేర్పుదలిర్పన్. 111

మ. నలిఁ గెందమ్ములచాయ కెంపులబలెన్ రంజిల్లు నమ్ముత్తియం
బులు రాపాడుచు దోఁయిలింపుచును మోముంజందురున్
నవ్వువె,న్నెల లల్లల్లన సోఁకఁ గాను మిగుల న్నిక్కంగ
నొక్కుమ్మడిం, దలఁబ్రాల్ వోసె నెలంత రాచనెలకుం
దార్కొన్నకోర్కిం దగన్. 112

ఆ. మించుమీఁది పెద్దమంచుతుంపర లన
మగువ మేనిమీఁద దగఁగ జాఱి
నలరి పుడమితేఁడునౌఁదల దగుముత్తి
యంపుఁబ్రాలు నించె సొంపు మెఱయ. 113

క. పోల్పఁ దొలిమిన్కు తెఱఁగున
వేల్పించిన పిదప రాచవిరివింటిదొరన్
వేల్పులకున్ మ్రొక్కించిరి
పాల్పడి యల పెండ్లికూఁతుఁబజ్జన కడఁకన్. 114

క. తగఁ బ్రాకెనయును దీఱిచి
నగవులపసులైన వెనుక నాలవనాఁడో

పూగ నాగవల్లి సేయఁగఁ
బగడపుటుప్పరిగలోనఁ బడతుకలెల్లన్. 115

సీ. చెలఁగుచు మంచిపచ్చలు దెచ్చి మేలేర్చి
దట్టంబుగాఁ గ్రుచ్చి తాచితాచి
వెన్నెలల్ వెదచల్లు వెండిముత్తియములు
నేర్పుతోఁ గ్రేవల నించి నించి
యచటెల్ల బలుగావి నద్దినట్లుగఁ జేయు
నెఱెమించు కెంపుల నెఱపి నెఱపి
చెంత దివ్వెలఁ బోని చీఁకట్లు వెదచల్లు
తెఱగంటిరాఱాలఁ దీర్చితీర్చి

తే. రమణమీఱఁగ గోమేదికములు చాలఁ
జెలువ మొప్పార నంచులఁ జేర్చి చేర్చి
కొలఁపునైదువచిలుకలకొలుకు లపుడు
పొలుపుదీర్చిరి మదిలోనఁ బొదలుతమిని. 116

మ. చెలిచన్నుంగవ బోల జాలు ననుచుం జెందమ్మిపూమొగ్గలం
జెలువల్ కిన్కనుగట్టివేసి రనఁగాఁ జెన్నొందుచు న్నాల్గువం
కల నుప్పొంగుచుఁబూజకుండ లలరెం గ్రైపొంది యామీఁ
దుఁగాఁ, గలయంజుట్టిననూలితోడ దివియల్ గన్పట్టుచుఞ్
జుట్టిరాన్. 117

చ. నెలఁతుక లిట్లు ప్రోలుతగ నేర్పు చెలంగఁగఁ జేర్చి తీర్చిరా
చలువవెలుంగు నింతిఁ దగుచందము లెల్ల నమర్చి పిమ్మటం
గలువలచప్పరంబు కడఁ గట్టిన గొజ్జఁగిమేడలోపలఞ్
మలచిన కెంపుగోళ్లసిరిమంచముపై నొగి నున్చునత్తఱిన్, 118

క. తెలనాకులు బాగాలును
నలమిన పెనిమిటులఁగూర్చి యైదువయెలనాఁ
గలకెల్ల నిడిరి విడ్య
మ్ములు దగ నప్పుడమితేఁడు ముదితయుఁ గడఁకన్. 119

వ. అయ్యెడ. 120

సీ. బుగులుకొంచును దావి దగనామతించుక
స్తురిజీని వ్రాఁతలదుప్పటములుఁ
బసిమిమించులు మించు పదియాఁబువన్నియ
బంగారు చెఱఁగులపచ్చడములు
ముంగొంగులను వ్రేలుము త్యాలకుచ్చుల
నలరెడు చెంగావివలిపములును
గఱిమానికంబుల గముల తేటలనఁ గూ
ర్చిన మేలిపట్టంచు రెంటెములును
తే. జెందిరపుఁగావు లంచలబందుకట్లు
జిలుఁగువన్నెలు మంజిళ్లు చిలుకచాలు
మొదలుగాఁగను జదివించి రదను వేచి
యనుఁగు లగునేలతేండ్లు యయాతి కపుడు. 121

చ. పొసఁగెడు వేలుపున్మొదవుఁబోలినయావుల నొక్క వేయిటిం
బసిమిదనర్చు కుందనపుఁబల్లకులన్ వెలలేనిసొమ్ములన్
వెసఁ గడుఁగూర్మితోడఁ జదివించినపిమ్మట గారవంబుతోఁ
బసుపున కిచ్చె నంత వృషపర్వుఁడు కొన్ని *విలాతు లింతికిన్.

వ. అప్పుడు శుక్రుండు. 123

క. అల్లున కిచ్చెను బచ్చల
పల్లకియును దమ్మికెంపుఁబతకపుజోడున్

* విలాతు లత్తలిన్ పా.

జల్లులసమకట్టలరగ్
బల్లించినవారువమును బంగరుగొడుగున్. 124
క. జాలుకొను పెంపుతోఁదగ
నీలాగునఁ దగవు నడిపి యింపు దలిర్పన్
లోలో నలరుచుఁ దనయి
ల్లాలిం గని శుక్రుఁ డనియె నర్మిలితోడన్. 125
క. ఇలువడియుఁ జెలువు గలిమియుఁ
గలవానికిఁ గన్నె నొసఁగఁగాఁ గోరుదు ర
ట్లిలువడియుఁ జెలువుఁ గలిమియు
గలవానికిఁ గన్నె నొసఁగఁ గాంచితి మింతీ. 126
క. ఒండుకొొద లేదు తూరుపు
కొండపయిం బ్రొద్దు వొడిచెఁ గొమ్మా యిఁక నే
డెండఁబడకుండఁ గూఁతుం
గొండిక యన కంపవలయుఁ గూరిమి ననుడున్. 127
వ. అమ్ముదిత యంపునదియై కూఁతుం గనుం గొని యి ట్లనియె.
క. మగఁ డేకొలఁదిని నడపినఁ
దగ నల్లే నీరుకొలఁదితామర వై యే
పగిది న్నడచెదవో నీ
దగునేరుపు చూత మింక నలరుంబోఁడీ. 129
క. మగఁ డేడుగడయు దేవర
మగువకు వే ఱొండు లేదు మఱిగావున న
మ్మగఁ డోఁగిరంబు గుడువక
తగ దింతికి నారగింపఁ దన కెట్టియెడన్. 130
చ. కినియక యర్మిలిన్ మగనికిం దగులైన యనుంగు లేగుదెం

చినఁ గడుఁ బెంపుసేయఁ దగుఁ జెచ్చెర నెమ్మది సంతసిల్లుచుం
దనబలఁగంబు నన్నలును దమ్ములు లోనుగ వచ్చి రేనియుం
బెనిమిటిపంపు పెంపునను బ్రేముడిఁ జేయుటపాటి చెల్వకున్.

క. చొచ్చినయింటికిఁ దగని
న్నిచ్చినయింటికిని వన్నె యేచందమునం
దెచ్చెదవో చూచెదఁగా
నిచ్చలు మనవంగడంబు నిన్నుం బొగడన్. 132

తే. వినుము మగఁ డేరినేనియు మనుపఁగోరు
నలుగు నట్లనె చెలువయుఁ దలఁకవలయు
నన్న తమ్ముఁడు తండ్రి మా మనుచుఁ గూర్మి
నొంటిపాటునఁ గూడి కూర్చుండఁ దగదు. 133

క. ఆవెన్నుఁడు లచ్చియు బలె
దేవియు దేవరయుఁ బోలెఁ దెలివి దలిర్పన్
నీవును మగఁడును బూవుం
దావి యనం గూడి మనుఁడు తరలనికూర్మిన్. 134

చ. పెనిమిటి దండుదాడిఁ జని పెంపునఁ గ్రమ్మఱుదాఁక వీడి
యం,బును సిరిగందముల్ విరులు ముట్టక యుండఁదగుం
బొలంతి తే,జునఁ గడు నొప్పుమట్టసపుసొమ్ములతోఁ గుఱు
మాపుచీరతోఁ, దనకలికొప్పుతో మిగుల దార్కొను
ము త్తైపు సేసబొట్టుతోన్. 135

సీ. అది వేల్పు రాయని యనుఁగు నెచ్చెలి సుమీ
బత్తితోఁ గూర్చుక వత్తుగాని
ప్రొద్దుపట్టికి నిది బోనకత్తియసుమీ
ప్రోదితోడుత నడపుదువుగాని

పైదలియది గాడ్పుదాదికూఁతురుసుమీ
కూర్మి యుప్పొంగ సాఁకుదువుగాని
యది పైఁడిదొరరాణి యనుఁగుఁజెల్లెలుసుమీ
యువిద గారవము సేయుదువుగాని
తే. యనుచు శర్మిష్ఠయూడిగం బమరఁజేయు
నలరుఁబోండ్లను వేర్వేఱ నప్పగించి
చెంతఁ దలవంచుకొని తనచెలులనడుమ
విన్ననైయున్న రక్కసికన్నెఁ జూపి. 136

క. ఇది పుట్టుబోఁగి దీనికిఁ
గొదవేమియు లేకయుండఁ గూర్చుక రమ్మీ
చెదరఁగఁజూడక నీవలె
ముదితా! కడుఁగూడు నీళ్లు మొదలగునెడలన్. 137

వ. అని పెక్కుచందంబులం గూఁతునకుం జెప్పి పయనంబు సేయుటయును. 138

చ. దళముగఁ గల్వతేకులతుదల్ దిగజాఱెడుమంచునట్లు కల్
గొలుకుల డిగ్గు నీరు గని గుండె దిగుల్లనఁ దల్లి యిట్లనుం
జెలువను గేలుదమ్ములను జెక్కులు నొక్కుచుఁ గౌఁగిలించుచున్,
వెలవెలవాఱు మోముపయి విన్నదనంబు దొలంకుచుండఁగన్. 139

క. ఉల్లమున వగవనేటికి
నెల్లుండియ పిల్వనంప నేతెంచెదు నా
తల్లివి గద నీతమ్ముఁడు
మల్లికయుం దోడు రాఁగ మది నడలేలా. 140

ఉ. లచ్చియు రూపు వంగడము లావును రాచఱికంబు గౌరవం
బెచ్చుగఁ గల్గి యిజ్జగము నేలెడుపెన్మిటిఁ జెంది తర్శిలిం
బిచ్చిలుసొంపుతోడ నినుఁ బెంచినమచ్చికఁ బాయలేక కా
నొచ్చెము లేదుగా తలఁపనొక్కఁటియుం గన నీతెఱంగునన్.
ఆ. అనుచు గారవించి యనుఁగుఁగూఁతును దోడు
కొనుచుఁ జెలులుఁ దాను గొంతదవ్వు
వచ్చి యంత నిల్చి పచ్చలపల్లకి
లోనఁ గొమ్మ నునిచి మేనునిమిరి. 142
క. ఉండు మనుమమ్మ క్రమ్మఱి
పొండను నీచెలులఁ దోడఁబుట్టువులగు నీ
చందుని మార్కొని ననుపుము
నిండుగఁ దగనుండు నీవు నీపెనిమిటితోన్. 143
క. అని పల్కి కూఁతు రంపినఁ
జనియెఁ శుక్రునిపొలంతి చానలుఁ దానున్
నునుపైఁడిగావి చెఱఁగులఁ
బనుపడియెడి జీనితోడిపల్లకి గదలన్. 144
వ. ఇట్లు గదలుటయు శుక్రుండు వెంట నరిగి యటమున్న
వెడలి వీడువిడిసియున్న యయాతిం గనుంగొని యి
ట్లనియె. 145
క. ఏదియు నెఱుఁగదు ప్రోదిఁ
బోదునఁ బెరిగినది తేఁడ మొన్నటిదిసుమీ
పైదలి నేరము గలిగినఁ
గాదని తెలుపుదువు గాని కడు నలుగకుమీ. 146
వ. అని యప్పగించి శర్మిష్ఠం జూపి యి ట్లనియె. 147

క. చెలువున వృషపర్వుం డను
బలియునిగాఁ రాపుఁబట్టి పసిబిడ్డసుమీ
వల రాచపనులు వెలిగాఁ
గలిగిన సొంపులను నడపఁగాఁ దగు దీనిన్. 148

వ. అని చెప్పి యతండు సేయుగారవంబున సంతసిల్లి. 149

చ. పుడమిని గల్గుతేండ్లు తగఁబూనికఁ గానుకలిచ్చి నిచ్చ నీ
యడుగుల వ్రాలఁగా జగము లన్నియు నేలుచు వెండి
పైఁడియుం, గొడుకులుఁ గూఁతులుం గలిగి గుజ్జము లేనిక
పిండు పల్లకీల్, గొడుగులు నివ్వటిల్లఁగను గూరిమితో
మను పెక్కు లేండ్లొగిన్. 150

యయాతి తనపురంబున కేఁగుట

మ. అని దీవింపుచు శుక్రుఁ డంతటను నెయ్యంబొప్పఁగాఁ
గ్రమ్మఱెం, జనియెఁ రాజును బేరులుం గడిఁదినిస్సానం
బులుఁ లోనుగాఁ, గను బెక్కుల్ బలువాయిదంబులు
చెలంగన్ వీడుచేరంగ నం, తను దానం గలవార లెల్లఁగడఁ
కల్ దైవాఱ నొక్కుమ్మడిన్. 151

క. కలపడగ లెత్తి కస్తురి
కలయంపులు చల్లి యాఁణిగలము త్తెపుము
గ్గులు వెట్టి వీదివీదులఁ
గలయంగా మేలుకట్టు గట్టిరి వేడ్కన్. 152

చ. అరు దటుచూడఁగా నమరె నందులఁ గ్రందుగఁ గుంద
నంపుఁబెక, గురుఁజులమీఁద దార్కొనిన క్రొత్తగు పుత్తడి
బొమ్మ లెల్లెడ, సొరిదిని తేనిసోబనపుసొంపు గనుంగొన

వచ్చినట్టి యచ్చరపువుఁబోండ్లచందమునఁ జక్కఁదనంబుల
సొంపు పెంపునన్. 153

సీ. ఎడలేక యుండంగ నిడినతోరణములు
పెల్లు పైఁబడెడు కరుళ్లు గాఁగ
దలుచుగాఁ బెట్టిన తావి ధూపపుఁబొగల్
గుంపులై మెలఁగు మొగుళ్లు గాఁగ
గములైన కఱిమానికముల మేడలు లోనఁ
గలఁగిడాగినయట్టి మలలు గాఁగ
నెల్లప్పుడును బిక్కటిల్లు బేరులమ్రోఁత
రహిమించు తరఁగలరవలి గాఁగ
తే. మేలిపటికంపుగోడలడాలు చాలఁ
బెంపుతోఁ బర్వు తెలినీటిసొంపు గాఁగఁ
బుడమిలోపల వేఱొండుకడలి వోలె
నెసఁగు నవ్వీడు సిరిపుట్టినిల్లు గాఁగ. 154

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావుతులున్ దొర లెన్నఁ
బెక్కురై, క్రందుగఁ గూర్మితో నెదురుగాఁ జని పౌఁజులు
దీర్పఁ జూచుచుం, గొందఱు ముందఱన్ బయిఁడికోలల
హెగ్గళు లెచ్చరింపఁగా, నిందనియాముచేఁ బొదలు నేనుఁగు
నెక్కి మదిం జెలంగుచున్. 155

వ. వీడు చొచ్చి యారాజు రాచవీదిం జనునప్పుడు. 156

ఉ. చూడఁగ నేఁగుదెంచి కడుఁజుక్కలతోడుత రాయుముత్తె
పుఁ, మేడలమీఁది కెక్కియలమేనక గ్రేణియొనర్చు ప్రాయ
పుం, జేడియ లబ్బురం బయినచెంగలువత్తగఁ జల్లి రందఱున్
వేడుకతోడ రాకలువవిందుపయి న్మదిమూర్తు లెచ్చఁగన్. 157

క. అంతట నాగసరంబుల
నింతులు తానములు మిగుల హెచ్చించుచు సా
మంతము పరవం బువులు వ
సంతములోనుగను గొనుచుఁ జనుదే మఱియున్. 158

సీ. వేలుపుపూఁబోండ్ల గేలిసేయు నొయారి
చెలువలు తగ వీరమలహారియును
గ్రొక్కారు మెఱుఁగు లుక్కున స్రుక్కఁగాఁ జేయు
వెలఁదుక ల్బంగారువీరణములు
వలరాజు పెంచినచిలుకలవలెఁ జాల
బెంపొందు నెలఁతుక ల్పిల్లఁగోళ్లఁ
బూఁదీఁగెలో యనఁ బొలుపొందుపడఁతుక
ల్పెల్లుగాఁ బైఁడితప్పెటలు మఱియుఁ
తే. గలిగినవి యెల్ల నేర్పుతోఁ దలిరుఁబోండ్లు
కడఁగి మ్రోయింప హెగ్గడికత్తె లరిది
పైఁడికోలలు పూని వే పదఁ డటంచుఁ
బల్లకీ ముందఱను బరాబరులు సేయ. 159

వ. అరుదెంచి. 160

క. ఆదట నేనుఁగు డిగి తన
పైదలియుం దాను బైఁడిపళ్లెరముల ము
త్తైదువ లారతు లీఁగాఁ
బ్రోదిం దననగరు సొచ్చెఁ బూనిక మెఱయన్. 161

వ. అనవుడు నటమీఁదికతం బెట్లుండె నని యడుగుటయు. 162

ఉ. లాలసరీగజాంకుశ తలంపులసొంపులతమ్మిచూలి యి
న్నేలయు నింగి పట్టముగ నిండ నమర్చిన నీయసంబుచే

గాలి మెసంగుతేని యొడికంబును జుక్కలసోయగంబు ము
త్యాలబెడంగు డిగ్గుపడునట్లుగఁ జేసినచాగపుంబలీ. 163

క. పాలఁతులకు మేఁటిపగఱకుఁ
దలఁపులలో నుండు చక్కఁదనమునఁ గడుఁ జే
బలువుకడంకల నెన్నం
గలజాణలరాయ మేనుగలవలరాయా. 164

బంధురవృత్తము.—
అని మొన నెదిరెడు బలుపగతుర మూఁ
కను కడలిం గని యేనిక పోఁ
జనియెడుపఱపగు నలతఱిమలచే
తం దగఁ ద్రచ్చి మెలంకువ వం
తన గలిగిన గెలుపులసిరినెలఁతం
దక్కం గైకొని యాయకతో
నెనరుగ నసపుంగలువలసైదో
డ్నీటుగఁ గూర్చిన నేరుపరీ. 165

గద్యము. ఇది శ్రీమదనగోపాలమంత్రప్రసాదలబ్ధసారస్వత సుకవి
జనవర్ణనీయవచోవిభవ భావనామాత్యతనూభవ పొన్నికంటి
వంశ్య తెలగనార్యప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ
తెనుఁగు కబ్బంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము

క. సిరిరాచవేల్ప! కడునీ
వరితనమున నీటిదాల్చు! వలముఁరిసుడివా
ల్దొరవంటి యొప్పుగల దే
వరజాణ యమీసుఖాన వలపులఱేఁడా. 1

వ. అటమీఁది తెఱంగు వినుం డిట్లు యయాతి దేవయానిం
బెండ్లియై వఱలుసిరులతో నుండునంత నక్కన్నియం దలి
మం బెక్కింపం దలంచి తలిరుంబోండ్లు. 2

సీ. నలఁచివైచినఁ జాలనలరుకప్రపుఁదావి
పొలుపొందు నెమ్మేన బుగులుకొనఁగ
వేనలిఁదుఱిమిన విరిసరంబులసొంపు
లలమి తేఁటుల నెల్లనామతింపఁ
దెలివికట్టాణిముత్తెముల పేరులరంగు
కలిమిఁ బాలిండ్ల వెన్నెలలుగాయ
వలపులచిఱునవ్వు కలయఁ బూఁజాలుగా
ముద్దుఁజెక్కులమీఁద మొలకలెత్త
తే. మోముఁదామర యింపైనమురువుతోడఁ
జెలువ మగుతియ్యఁదేనియచేత నమరు
మరుని యాఱవతూపునాఁ బరఁగునట్టి
దేవయానిఁ గనుంగొని టీవిమెఱసి. 3

సీ. బంగారుకుండలఁ బగటు నీగబ్బిగు
బ్బలమీఁది కొక మేలు గలుగు నేఁడు
జగడాలఁబగడాలఁ దెగడునీమోవికిఁ
బోలుపైన యొకడాలు గలుగు నేఁడు
మెఱుఁగుచేఁ గ్రొమ్మించుమించు నీమేనికి
నలరింప నొకయింపు గలుగు నేఁడు
తళ్కులై ముద్దులు గుల్కు నీచెక్కుల
కెలమిగా నొకసొంపు గలుగు నేఁడు
తే. తాళుకో ప్రొద్దుగ్రుంకినదాఁక ననుచుఁ
బలుకఁ దనలోనికూరిమి బయలువడఁగ
నీక కన్నుల జంకించి యేమొ గొణుగు
దేవయానిఁ గనుంగొని తెలివయొకతె. 4

క. కని మది గలిగినతీరున
నిను మగనిఁ వ్రాసికొన్న నిలువుఁబతిమలం
గనుఁగొని యెఱుఁగక పలికిన
ననఁబోఁడిం గినియఁ దగునె నవలా నీకున్. 5
తే. మగువ యెన్నఁడు సిగ్గున మగనిఁ జూడ
నట్టిగోలవు నిన్నన నగునె యైన
విదియనాఁ డేరుపడకున్నఁ దదియనాఁడు
కానఁబడియెడుపని కింత కనల నేల. 6
వ. అని నగుచుం బలుకునంత. 7

క. అఱిముఱిని గ్రుంకుమలపై
నెఱసంజను గ్రమ్మినట్టి యెరవలి సెగబి

ట్టఱెమినఁ జని వడిఁ గ్రుంకెం
బఱపున ననఁ బ్రొద్దు గ్రుంకెఁ బడమటికడలిన్. 8

వ. అప్పుడు. 9

తే. మెలఁత మగమానికంబుల మేడలోన
నెత్త మాడుద మరు దెమ్ము నీవటంచుఁ
గూర్మిఁ గైదండ యొసఁగి తోడ్కొనుచుఁ బోయి
చనుపకంబుల నొప్పెడు చవికయందు. 10

సీ. పలుకులఁ దేనియ ల్గులుకఁ గోక్కోకంబు
చెలఁగి రాఁజేయు గాచిలుకగములు
నలరి వీనులపండువులు గాఁగ వలరాచ
ప్రామిన్కు లొగినేర్చుపారువములు
నలరులవిలుకాని గెలుపుఁగబ్బంబులఁ
జదివెడుగోరువంకకొదమపదువు
వినఁ గూడ మరుని దేవేరి పైఁ బాటలు
వాడు లేఁబాయంపు బరితములును
తే. గలిగి పూఁదేరు రాయనికొలువు నెలవు
పగిది నొప్పారు పసిండియుప్పరిగలోనఁ
గెంపు నెఱమానికంపువాకిటికి వచ్చి
తమ్మికెంపులపలకలతలుపు దిగువ. 11

చ. బొగడలసాన రాచిలుక పుత్తడిపావలు తావిదూపపుం
బొగలు జవాది వంక తెలిముత్తెపుఁజిప్పపసిండిగిండియుం
బగడపుఁగోళ్లమంచము జమల్పఱుపుం గపురంపుఁదిన్నె కెం
పుగముల జాలవల్లికయుఁబువ్వులు మించులనిల్వుటద్దమున్.

తే. కలిగి యొప్పారునందు బంగారుకోళ్ల
తూఁగుమంచముపై వేల్పుదొరయ పోలె
సొంపు పెంపున మిక్కిలి సోయగంబు
నలరఁ జెలువొందుచున్న యయాతిఁ జూచి. 13

చ. నడుము వడంక సిబ్బితి గనంబడ విప్పగు గొప్పకప్పు క్రొ
మ్ముడి విడి జాఱ నందియల మ్రోఁతకుఁ దోడుగఁ దమ్మికెం
పుపెం, దొడవులు మ్రోవఁ బయ్యెద చనుంగవ చక్కి
నొకింత చూపఁగా, వడి మగుడంగ నేఁగుచెలువం గని
నవ్వుచు నింతు లింపునన్. 14

క. ననఁబోడి యోర్తు కూడం
జని కేలు దెమల్చిపట్టి చనునే నీకుం
బెనిమిటిని జూచి క్రమ్మఱఁ
బెనఁగక చనుదె మ్మటంచుఁ బేర్కొని తిగువన్. 15

తే. తెఱవ యాఁకొమ్మకేలు విదిర్చి సైచి
కేలఁ గంబంబు వట్టి జంకించి పెనఁగ
వెలఁది మ మ్మేల వెట్టఁ నవ్వింప నీకు
బయిటి కెత్తినదివ్వె నీదయినడక. 16

క. తక్కినకన్నెలవలె నీ
విక్కడ బూటకముసేయ నేటికి నీకున్
మ్రొక్కెద నీఁకఁ బెనఁగకు నా
యక్కవుగద రమ్మటంచు నడుగులఁ బడియెన్. 17

చ. నినిచినసిబ్బితిం దఱిమి నెమ్మదిఁ జేరి మరుండు నొంప నో
ర్వనిపని గట్టిపెట్టి చెలి రమ్మని కేలుదెమల్చి తివ్వఁగాఁ
జనియెఁ బెనంగుచున్మఱియు సన్నల వచ్చెదఁ గాని మించి

పొ, మ్మని యు బెడంకియు న్నగుడి యంతట నింతట నిల్చి
లాగుచున్. 18

వ. ఇట్లు వచ్చినం దోడ్కొని చని నెచ్చెలి యచ్చెల్వం జూపి
రాజున కి ట్లనియె. 19

క. మును పెంతకూర్మి గలిగిన
ననఁబోఁడికి నిట్టి యెడల నానయ తగుఁ గా
వున మగువ తడవు నడిపెం
గనుఁగొనుఁడీ మీఁర లొంఁడుగాఁ దలఁపకుఁడీ. 20

వ. అని విన్నవించి యామించుఁబోఁడి నారాజేనిపాన్పుఁ జేర్చె
నంత. 21

సీ. చిలుకకుఁ జదువు రాఁ జెప్పలే దాయెఁగా
యనుచు వేగిరపడి చనియె నొకతె
నెమ్మి యేమయ్యెనో నేఁ డాట గఱపక
యరుగు దెంచితి నని సురిగ నొకతె
యీపరాకున మేఁత యిడనైతిఁ గా ప్రోది
గొరువంక కనుచుఁ దాఁ నరిగె నొకతె
నడ నేర్పలేదాయె ననుఁపురాయంచకుఁ
దడవయ్యె ననుచుఁ దాఁ దారె నొకతె

తే. తనదు కనుసన్న జేనికిఁ దలిరుఁబోఁడి
నలముకొ మ్మని చూపుచుఁ దలఁగె నొకతె
విడెము దేవైతి వని యొక్క-వెలఁదిఁ దిట్టి
పూని యమ్మెడ వెలికినిఁ బోయె నొకతె. 22

వ. అంత. 23

క. నను నెఱుఁగనిగోలవు బలె
ననయము ని ట్లనఁగి పెనఁగి యలసితివి గదా
యని మే నంతయు నిమురుచు
ననఁ బోఁడిమిఁ గారవించె నన లెత్తుతమిన్. 24

చ. పనుపడుకూర్మి నొక్కొకక నెపంబునఁ జెక్కులుఁ గొప్పు
గుబ్బలుం, జనుఁగవ యంటి సిబ్బితిఁ దగం దొలఁగించుచుఁ
బాన్పుఁజేర్చి నే,ర్పునఁ జెలిఁ గౌఁగిటం బొదివి పొందెఁ
గడుం గడు సేద దీర్చుచు, న్ననవిలుకాఁడు సంతసమునం
దనవూనిక యాట కుబ్బుచున్. 25

సీ. పుక్కిళ్ల విడియంబు లక్కప్పురపుఁదావిఁ
బొదలెడు సన్నయూర్పులు సెలంగఁ
గౌఁగిళ్ల బిగ్గరఁ గదియించి మేనుల
నిరువుర చేతుల నెలమి నలమఁ
దలిరుపైఁ దెంపులు దాచిన చందాన
మునిపళ్లనొక్కుల మోవు లలరఁ
జెలఁగి పెనంగఁగూర్చిన క్రొవ్విరులు జాతి
చిక్కైన కొప్పునఁ జిన్నె లమరఁ

తే. గ్రమ్ముచెమరున నొకకొంత గరఁగి నెఱసి
బుగులుకొని జాఱుకస్తురిబొట్టు దనర
నిదుగమంపునఁ దగిలి రన్నెలతేఁడుఁ
బడఁతి యును నంత వలరాచపనుల నలసి. 26

వ. అప్పుడు. 27

చ. తెలతెలవాఱెనన్ దొరలదేవర తామరకంటివాతెఱన్
బలు మొన లొత్తి మేల్కొలుపఁ బైవలి గేస్తుని మోము

చెక్కుచే, నలముచుఁ జేతదువ్వలువ నంత మొలక సవ
రించి లేచి తా, నలయక వీడె మిచ్చె నతఁ డప్పటి కప్పనిప్పైఁ
దలంపిడన్. 28

వ. ఇట్లు వీడెం బొసంగి క్రమ్మఱ నా రాచకొమరుకోర్కి దీర్ప
నేర్చుతమి నలరునంత. 29

చ. పెనిమిటి యైన వెన్నుఁ డొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టు
గ్రుంకుగ,ట్లను తన రెండుచేతుల నొయారము మీఱఁగ
నేలకొమ్మ దా,ల్చిన పవడంపుఁజుట్టలుఁగుఁ జిందమునుంబలెఁ
జూడనొప్పె నం,తను దగఁ దూర్పునన్ వెనుకఁ దమ్ముల
విందును జందమామయున్. 30

వ. అప్పు డప్పడంతి యొప్పులకుప్ప యగు పసిండి యుప్పరిగ
లోనికిం జని తగుపనులు గావించి యున్నంతం జెలులువచ్చి.

తే. రహిని వలపులరాయని రాచలచ్చి
కరణి నొకవింత యగుసొయగమున మెఱయు
నిన్నుఁ గనుఁ గొనఁగాఁ గల్గెఁ గన్నులారఁ
గోర్కు లెల్లను మాకుఁ జేకూడె నేఁడు. 32

వ. అని పలుకం గినుకం బలె జంకించు దేవయానిం గని యొక్క
తొయ్యలి యి ట్లనియె. 33

సీ. అదలించితివి కొమ్మ నదియే మెఱంగుఁ బ
య్యెద జాఱనీకువే యిగురుఁబోఁడి
యొఱుఁగ కన్నది దాని నేల జంకించెదు
వెలఁదిరో యిం కొక్క విడెము సేయు
మఱచి పల్కినది యోముగువ యాయొలనాఁగ
మెడఁ బచ్చికస్తురి మెదిచి యలఁదు

నగుచు నన్నది దీని దగుతప్పఁ జూడక
సందిళ్ళఁ బూయవే గంద మతివ
తే. కనల నేటికి వీడ్వడఁ గప్పుకొన్న
మగని దుప్పటి యిచ్చి రా మగుడ ననిన
నతివ బంగారు నరలోని కరిగి మిగులఁ
బెరుఁగు సిబ్బితిచే గడెఁ బెట్టుకొనియె. 34
తే. ఇట్టు లరలోనఁ జొచ్చిన యిగురుఁబోఁడిఁ
గల్లఁజేసితి మని చాల గారవించి
పిలుచుకొని వచ్చి సకియలు పెంపుసేయ
నలరె నీలివిఁ గొన్ని నా ళ్ళరుగునంత. 35
క. వెలవెలఁబాఱె న్మోగ మూ
ర్పులు మిక్కిలి సందడించెఁ బొక్కిలి విరిసెన్
నలుపెక్కెఁ జన్ను మొనల
న్నెలకొని యప్పైదలికిని నెలమసలంగన్. 36
చ. కడు బలు పయ్యె నెన్నడుము గ్రందుగ వాచవు లుప్ప
తిల్లె నుర్ల,దొడవులు వ్రేఁకమయ్యె మదిఁ దోఁచెను
గోర్కులు పాటలాటలున్, గుడుపులు నించవయ్యె మఱి
కూర్కులు డప్పియుఁ జాలఁ బుట్టె నె, న్నడలు దడంబడం
దొణఁగె నాతికిఁ దొమ్మిదినెల్లు నిండఁగన్. 37
వ. అంత. 38
క. లలి నానెలఁతకు యదువనఁ
గలిగెం గొమరుండు కలిమికలికికి మరుఁడున్
బలె రూపుసొంపునన్ రా
కలిమియు బలిమియును దనదుకైవడిఁ దోఁపన్. 39

వ. ఇట్లు గలిగిన యక్కొమరుండు పెరుఁగుచున్నయెడ. 40

తే. కలిమిదైవాఱ నయ్యింతి గనియె మఱియు
నలరి దుర్వాసుఁడను రాచకలువతేని
గట్టుదొరపట్టి కూరిమిగడలుకొనఁగ
నాలుమొగములు కలిగిన యతనిబలెను. 41

### యయాతి పుష్పవనమున కేఁగుట

వ. ఇవ్వితంబునం బెడిదంపుఁ గడిమిమగఁటిమినిం గడు నమరు కొమరులం గాంచి మించిన సిరులం గొఱలు దేవయానిం జూచి శర్మిష్ఠ తనలోన. 42

క. పెనిమిటినిఁ జెంది కొడుకులఁ
గన మగువలు గోరు టెందుఁ గల దటువలెనే
పెనిమిటినిఁ జెంది కొడుకులఁ
గనియెను గదె దేవయాని కణఁకెట్టిది యో. 43

క. ఏమనుకొనఁగల దిఁక నే
గోమున రాకాసితేనికూఁతురఁగా నే
నోములు నోఁచితినో యీ
బాములఁ బడవలసె ననుచుఁ బనువుచునుండెన్. 44

క. అంతట నొకనాఁ డింతులు
సంతసమునఁ గొల్వఁ బైఁడిజగ్గిలెపైఁ జే
మంతులమాడువులో విరి
కొంతపువే ల్పనఁగ రాజు కొలువున్న యెడన్. 45

మ. కుసుమం బద్దిన వల్పెపయ్యెద చెఱంగు న్మంగలం జెక్కి వె
క్కసమై యొప్పెడు గబ్బిగుబ్బచనుప్రేఁకం బానఁగాలేక కౌ
నసియాడ న్మొలనూలిగంట లొగి మ్రోయం గొమ్మ యొక్కర్తు

వచ్చి సుమాళంబున మ్రొక్కి కాను కొసఁగెం జెంగల్వ
లాతేనికిన్. 46

ఉ. ఆవిరు లట్లొసంగి కడునర్మిలితోడుతఁ గొమ్మమోమునం
డావికిప్రాలుతుమ్మెదలఁ దాఁ బలుమాఱును జోఁపుకొంచు
నే, దేవరతోఁటఁ గాచుపాలఁతి న్వేను మచ్చుట సొంపు
మీఱు పూఁ,దీవెలు విన్నవింపఁ జనుదెంచితి నిచ్చటికంచు
ని ట్లనున్. 47

మ. సురపొన్న లక్కలిగొట్లుచిందుగలుకర్జూరంబులబ్బెందలు
స్గురువెందల్పొగడల్మొగళ్లవిరుగల్గొరంటలున్నంపెఁగ
ల్గరుగుల్జిన్నులుదాడినిమ్మలుమొదల్గా మ్రాఁకులొక్కుమ్మడి
న్వేరుఁలంగన్నులపండువైతనరెడిన్వేంచేసిచూడందగున్. 48

క. అని విన్నవించుపలుకులు
విని సంతసమొప్ప రాజు వెలఁదుకలెల్ల
న్మనువడి యూడిగములతోఁ
జనుదేరం గదలి తోఁటచక్కికి నరిగెన్. 49

తే. ఇట్లు లరిగినరాజుతో నేఁగుదెంచు
కొమ్మ లెల్లను బూవులుగోయఁ గడఁగి
మొత్తములు గూడుకొనుచు నువ్వెత్తుగాఁగఁ
గడలమ్రాకుల వేర్వేఱఁ గ్రమ్ముకొనఁగ. 50

సీ. కొమ్మ యీపొన్న పూగుత్తు లంటితివేని
గోమ లైననీగబ్బిగుబ్బలాన
చెలువ యీమానిలేఁ జిగు రంటితేని నె
త్తావినింపొందు నీమోవియాన

వెలఁది యీపూఁదీవియల నంటితేని ను
ద్దొడవులతోడి నీయొడలియాన
కలికి యీకొలనిలోఁ గలువలంటితివేని
గడునొప్పు నీవాలుఁగన్నులాన
తే. యతివ యీమెట్టదామర లంటితేని
నొడిచి చాటెద నేను నీయడుగులాన
యనుచుఁ బూఁబోండ్లనెల్లఁ బా నానవెట్టి
తోఁటతొయ్యలి యారాజుతోడ ననియె. 51

ఉ. వన్నెగ మీఁదఁబ్రాఁకి దిగవ్రాలెడు తీవలచేత నొప్పెడుం
బొన్నలు తేఁడ చూచితివె పూలబెడంగున నాల్గువంకలం
జెన్నుగ ప్రేలుచున్ జడలచేఁ గడుమీఱుచుఁ జెక్కు-
టూపులో, క్రొన్నెలఁదాల్చువేలుపులొకో యని చూపఱు
చూచి మెచ్చఁగన్. 52

క. బలువగుసొంపున వ్రేఁగగు
తలిరులచే మావిగములు తద్దయు మించె
న్వలరాయనితామరకెం
పులమేడలు వోలెఁ జిల్కబోదల కిరవై. 53

చ. పరువము లైనక్రొవ్విరులఁ బాయక కెంపగు దాడినిమ్మలం
దిరముగఁ గ్రమ్మునట్టి పువుఁదేనియ లానఁగ వచ్చి క్రమ్మఱన్
దిరుగుచుఁ జాల్పులైనమగతేఁటులు మీఱెడు తేఁడచూచితే
విరివిలుకాఁ డొనర్చునలవేలిమిమంటలపైఁ బొగల్వలెన్. 54

క. పనసలు కెమ్మోశలఁ దగుఁ
గనుఁగొనఁగా గాడ్పుబల్మిఁ గారాకుపెక

